
coromandel
gromor








coromandel
gromor
కోరమాండల్
గ్రోమోర్
ఎరువులు

శ్రీ రాజ్ ఆర్ట్స్ ఫిలింస్
సవినయంగా సమర్పించు

# విచిత్ర కుటుంబం

| మాటలు: | పాటలు: | సంగీతం: | కెమెరా: |
| --- | --- | --- | --- |
| భమిడిపాటి రాధాకృష్ణ | డా॥ సి. నారాయణరెడ్డి | టి.వి. రాజు | ఆర్. సంపత్ |

దర్శకత్వం: కె.ఎస్. ప్రకాశరావు    నిర్మాత: వి.కె.పి. సుంకవల్లి

ఆంధ్ర-సీడెడ్: విజయా    నైజాం: ఉషా ఫిలింస్



# ఉత్తరాలు

### కథలు

ఈమధ్య మా అభిమాన వారపత్రికలో ప్రచురిత మవుతున్న కథలు, సాధారణంగా చాలా బాగుంటు న్నాయి. చాలామంది కొత్త రచయిత(త్రు)లను పరిచయం చేస్తున్నందుకు చాలా సంతోషం. నేటి సాంఘిక సమస్యలను ఛేదించే [illegible] కొరుక్కోడు వంటి కథలు అందిస్తున్న మీకు ఎన్నో అభినందనలు.

కాని, చాలా కథల పేర్లు పాతసినిమా పాటలా పాత వళ్ల దొరికి అన్నట్లు ఉంటున్నాయి. నన్ను క్షమించరూ, కడలిగర్భంలో వంటి శీర్షికల కథలు కనీసం ఓడజను చదివి ఉంటాం. రచయిత(త్రు)లకు, ఇంతకుముందు వాడిన పేర్లే తప్ప, కొత్త పేర్లు కథలకు దొరకటం లేదా?

కా. శేషగిరిరావు, (బొంబాయి)

* * *

శ్రీమతి పరిమళా సోమేశ్వర్‌గారి నన్ను క్షమించరూ కథ చాల బాగున్నది. చాల వాస్తవికంగా ఉన్నది. విద్యార్థులు [illegible] చేయు అల్లరి చక్కగా చూపించింది.

విన్నకోట [illegible], (అనకాపల్లి)

* * *

ఈ వారం పత్రికలో మీరు ప్రచురించిన శ్రీమతి పరిమళాసోమేశ్వర్‌గారి 'నన్ను క్షమించరూ!' ఉన్నతంగా ఉంది. అంతేగాక స్టూడెంట్సులోని 'లోమనిషిని—మనస్సును' తెల్పునదే గాక హృదయాన్ని పిండి కన్నీటిని తెప్పించేదిగా ఉంది. పోతే తమ ఉపాధ్యాయిని తిడితే 'డిస్నెట్' ఫీలయ్యి మూడో నం. చదివే 'మెడికోస్' చుక్కలాట ఆడటం అసహజం!

థామస్‌విజయం, (అనంతపురం)

### సీరియల్

పరిశుద్ధత, నీతి అయా మనుష్యుల స్వభావాన్ని, వాతావరణాన్ని, కొన్నిసార్లు పరిస్థితులను బట్టి ఉం టుంది. కాని, మల్లాప్రగడ కాదని విజయకుమారి గారు తమ లేఖలో సెలవిచ్చారు. నేటి సమాజంలో స్వభావాన్ని, వాతావరణాన్ని దిగద్రొక్కే పరిస్థితు లుండబట్టి, పరిస్థితులపైనే ఆధారపడుంది. నేటి పరిశుద్ధత, నీతి అనుటలో అతిశయోక్తి రవంతయు ఉండనేరదు. కావున యీ పరిస్థితుల ప్రభావం హెచ్చుగా పనిచేయు కులాల దేనినైనా ఎత్తి చూపు టలో అసమంజసం, అసహజం—అనాదరణ ఉంటు న్నట్లు భావించుటతమనీడను తానే చూచి భ్రమించు

---

# ఆంధ్రపత్రిక

## తుఫాను బాధితులకు సహాయనిధి

ఈనెల 16 వ తేదీ నుంచి నాల్గురోజులపాటు నెల్లూరు, గుంటూరు, కృష్ణా, ఉభయ గోదావరులు, ఖమ్మంజిల్లాలు బ్రహ్మాండమైన తుఫాను దెబ్బకు గురియైనాయి. వర్షాలు, వరదలు సంభవించి అపారమైన నష్టం వాటిల్లింది. చేలమీది పంటలు చేలమీదనే దెబ్బతినిపోయినాయి. విశేష జననష్టం, పశునష్టం సంభవించింది. ఇళ్లు కూలిపోయినాయి. అనేకమంది నిరాశ్రయులైనారు.

ఈ విధంగా తుఫానువలన బాధ రాష్ట్రాన్ని ఆవరించింది. ఈ బాధకు లోనైన వారికి ఎవరి శాయశక్తిని వారు సహాయంచేయడం మానవీయమైన ధర్మం. అందుకుగాను "ఆంధ్రపత్రిక", తుఫాను బాధితుల సహాయార్థం నిధిని నేటినుంచి ప్రారంభం చేస్తున్నది. బాధలోవున్న తోటి మానవులకు తోచిన రీతిని సహాయంచేయడం పుణ్యకార్యం. సకల ఆంధ్రప్రజలేగాక యావద్భారత ప్రజలుకూడా యీ పుణ్యకార్యంలో పాలుపంచుకుని తమ ధర్మాన్ని నిర్వహించగలరని మా విశ్వాసం.

ప్రతివిరాళము పంపినవారి పేరుతోసహా ప్రకటించబడుతుంది. విరాళం మొత్తము "ఆంధ్రపత్రిక" పేర 7, తంబుచెట్టివీధి, మద్రాసు-1 కి గాని, గాంధీనగరం విజయవాడ-3 కి గాని పంపించవచ్చును.

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి తుఫాను బాధితుల సహాయనిధికి రు. 501 లు విరాళంగా యిచ్చారు.

తుఫాను బాధితుల సహాయనిధికి "ఆంధ్రపత్రిక" తరఫున రు. 2500 విరాళము ప్రకటిస్తున్నాము.

చెక్కులు, డ్రాఫ్టులు పంపేవారు వాటిపై ఆంధ్ర సైక్లోన్ రిలీఫ్ ఫండ్ అని వ్రాసి, కేరాఫ్, మేనేజర్ ఆంధ్రపత్రిక మద్రాసు అని వ్రాయాలని అభ్యర్థన.

మనసులు చాలా చిత్రమైనవి
ఎప్పుడు పొంగుతాయో, ఎప్పుడు
క్రుంగుతాయో చెప్పటం కష్టం. అలాంటి
మనసుల మధ్య . మనుష్యుల మధ్య
జరిగిన మహోత్తర కుటుంబగాథ!

చూడండి!


నాగావళి (విజేతా) ఫిలిమ్స్ వారి

# జరిగిన కథ

కథ-దర్శకత్వం: కె. బాబూరావు  నిర్మాత: కె. ఎ. ప్రభాకర్

ఆంధ్ర: జోతి పిక్చర్స్  సీడెడ్: నవభారత్

STUDIO Ketha



రష్యా భారం
రష్యా భారం
సి.పి.ఐ.కుడి
కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ ఇండియా
కుడి, ఎడమ దగ్గరకు చేర్చ
దానికి
రష్యా ప్రయత్నం




ఆంధ్రప్రదేశ్‌లో వరదలు




నక్సలైట్ల దురాలోచన
నిప్పు పెట్టిన చెయ్యి




మలేసియా
OOMMEN




తెలంగాణా ప్రజాసమితి ఛైర్మన్‌గా డా॥ చెన్నారెడ్డి పదవీ స్వీకారం.
తెలంగాణా సమస్యకి ఆయన తరుణోపాయం చూపించగలరా?
తెలంగాణా సమస్య

# చైనా, రష్యా, అమెరికా, పాకిస్తాన్ - భారతదేశం

శ్రీ కృష్ణమీనన్ ఎన్నికలలో గెలిచినందుకు వారి కామ్రేడ్లు వారిని అభినందించారు. శ్రీ మీనన్ ఈసారి పెద్ద నగరం వదిలి చిన్న ఊరికి వెళ్లారు. కాంగ్రెసుపార్టీ అభ్యర్థిగా తర్వాత స్వతంత్రంగా నిలిచిన ఆయన ఈసారి బెంగాలు యునయిటెడ్ ఫ్రంట్ అభ్యర్థిగా నిలబడ్డారు.

ఆయన గెలుపువార్త నాడే ఒక మాజీ సేనానాయకుడు, బ్రిగేడియర్ జె పి డాల్వీ 1962 చైనా—భారతదేశాల పోరాటం గురించి రాసిన పుస్తకం సమీక్ష ఒకదానికి మంచి ప్రచారం జరిగింది. బ్రిగేడియర్ డాల్వీ తమ పుస్తకంలో శ్రీ మీనన్ చైనా ప్రమాదాన్ని ఎలా తోసివేశారో చెప్పారు. 'ఆయన ఎప్పుడూ పాకిస్తానీ ప్రమాదం గురించే చెప్పేవారు చైనా ఉద్దేశాలని తెలియపరిచే సాక్ష్యం పెరుగుతున్న కొద్దీ ఆయన దేశానికి ప్రమాదం ఏమీ లేదని అసత్యఅభయాలనిచ్చేవారు,' అని రాశాడు బ్రి డాల్వీ.

## అమెరికా వ్యతిరేకత

దీని పరిణామాలు ఎన్నో ఉన్నాయి. చైనా దురాక్రమణవల్ల భారతదేశం అమెరికా వద్ద ఆయుధ సహాయం పొందింది. ఇది పాకిస్తాన్‌కి నచ్చలేదు. ఇండియామీద దాడి తీసింది భారత—పాక్ యుద్ధం వల్ల అమెరికా ఆయుధ సహాయాన్ని, రెండుదేశాలకీ, ఆపివేసింది భారతదేశం రష్యాని ఆశ్రయించింది అమెరికా—వ్యతిరేకత దేశంలో పెరిగింది . . .

శ్రీ మీనన్ (గెలిచినతర్వాత) అన్నారు— భారత దేశంలో విప్లవం అవసరం లేదు, ప్రజాస్వామ్య పద్ధతుల ద్వారా విప్లవం తీసుకురావచ్చు; అయితే ఈరకం మార్పుకి ప్రజలు కష్టపడి పని చెయ్యాలి, నాయకత్వమూ కావాలి, అని.

## రా. స్వ. సే. సం—నక్సల్‌బారీ

ప్రభుత్వం రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘాన్ని ఎందుకు అణచివెయ్యలేదని శ్రీ మీనన్ కోపంగా అడిగారట నక్సల్‌బారీ వారి ప్రచారమేకాక ఇతరుల ప్రచారాన్ని కూడా అణచటం అవసరం అన్నారు ఆయన.

కొన్ని దినాలక్రితం కమ్యూనిస్టులు నిరుద్యోగుల ఊరేగింపు ఒకటి ఏర్పాటు చేశారు ఊరేగింపు సందర్భంలో జరిగిన సమావేశంలో శ్రీ ఎస్. ఏ డాంగే శ్రోతలని ప్రస్తుతపు రాజకీయ విధానాలని ఎదిరించి, తుపాకులసాయంతో అధికారాన్ని బలవంతంగా లాక్కోమన్నారు.

ఊరేగింపు పార్లమెంటు మీద పడింది పోలీసులతో ఘర్షణ జరిగింది.

రష్యాలో నిరుద్యోగ సమస్యలేదని శ్రీ డాంగే అన్నారు మన కేంద్ర కార్యాలయంలో అతిఉద్యోగం ఉందని అందరికీ తెలుసు ఇటువంటి పరిస్థితి రష్యాలో నిలవుతుందా? ఇప్పుడు శ్రీ డాంగేని బలపరిచే వారెందరో ఫయిళ్లతో పని చేస్తున్నారు రష్యాలో వారు ఏ పొలంలోనో, గనిలోనో చేతులతో పని చేసేవారు.

## డాంగే కింద మిలిటరీ

అలాగే, కేంద్రంలో శ్రీ డాంగే అధికారంలో ఉంటే రాష్ట్రాలలో స్వాతంత్ర్యం తగ్గుతుంది మిలిటరీ వారు దాడి తియ్యటానికి భయ పడరు.

నేటి కాంగ్రెసుని తిట్టే కమ్యూనిస్టు పేపర్లు రేపు శ్రీ డాంగేని తిట్టలేవు అవి ఆయన చెప్పినట్లు రాయాలి, అంతే

ఇంతమంది వామపక్షంవారు ఉన్నారు పెద్దనగరాలలో బీదవారిని గురించి వారు ఎప్పుడయినా పట్టించుకున్నారా?

మిల్లులలో, పెద్ద ఆఫీసులలో కంప్యూటర్లు పనికిరావని ప్రదర్శనలు జరుపుతారు ఎందుకు? అవి మొత్తం మీద అమెరికాలో చేసినవి కాబట్టి రష్యా గనుక కంప్యూటర్లు అమ్మితే అవి ప్రసాదం అనుకుని వాడమంటారు శ్రీ డాంగే.

## టోంగాలు

ఢిల్లీలో టోంగాలు మాయమవుతున్నాయి. ఎందరో వాటిలో ప్రయాణం చేసేవారు అవి క్రమంగా మాయమయి వాటి బదులు మోటారు స్కూటర్ బళ్లు వస్తున్నాయి.

నిరుద్యోగం పయిన దీని ప్రభావం ఏమిటి?

గుర్రానికి గడ్డి, ధాన్యం కావాలి ఇవి ఉత్పత్తి చేసే వారికి అదే ఉద్యోగం గుర్రబ్బండి తయారు చేసే వడ్రంగికి ఇదే ఉద్యోగం కమ్మరి విషయమూ అంతే ఇక జీను, దీపాలు మొదలయిన వాటి తయారీ సంగతి సరేసరి.

## పెద్ద వ్యాపారస్థులు

మోటారు స్కూటరు బళ్లవల్ల లాభం పొందేదీ ఎవరు? పెద్ద వ్యాపారస్థులు. నష్టపోయేది ఎవరు? చిన్నచిన్న పనివారు.

ఈ విషయములో శ్రీయుతులు డాంగే, ఎస్ ఎమ్. బెనర్జీలు ఏమయినా పట్టించుకున్నారా? ఎందుకు పట్టించుకోలేదు?

## సాధువులు, బైరాగులు

శ్రీ డాంగే అధికారంలోకి వస్తే లాలా గుల్జారీలాల్ నందాగారి బైరాగులు, సాధువులు మాయమవుతారు. కమ్యూనిజమ్‌లో వీరికి స్థానం లేదు సాధువు ఎవరయినా నిరాహారదీక్ష మొదలు పెడితే చచ్చేదాకా పస్తుపడమంటారు, అధికారులు.

తిరిగి శ్రీ మీనన్ ప్రకటన పరిశీలించితే— ఆయన ప్రజాస్వామ్యమే తన సాధనం అన్నారు. హిట్లరుకూడా ఇదేమాట అన్నారు అతనూ, అతని అనుచరులూ జర్మన్ శాసనసభలని ప్రవేశించి జర్మనీలో ప్రజాస్వామ్యాన్ని నాశనం చేశారు కమ్యూనిస్టులు ఎన్నో దేశాలలో ఈ పద్ధతినే అవలంభించారు

## అంతా సరిపోతుంది...

ప్రస్తుతం ఎన్నో ఆసియా దేశాలలో దారిద్ర్యం హెచ్చుగా ఉంది ఇదంతా పాత సామ్రాజ్యాల ఫలితమే అంటారు కమ్యూనిస్టులు. తాము అధికారంలోకి వస్తే అంతా సరిపోతుంది, అంటారు.

జాతీయ పక్షాలని దూషించి గత్యంతరం తమ పరిపాలనే అంటారు.

జాతీయ పార్టీలలో చీలికలని పెంపొందించటానికి ప్రయత్నిస్తారు. నేడు కాంగ్రెసు పార్టీలో జరుగుతున్న చాలా పోట్లాటలు వీరు పెట్టినవే.

## కాంగ్రెసు పలుకుబడి

1958 తీర్మానంలో కమ్యూనిస్టుపార్టీవారు కాంగ్రెసు పలుకుబడి తగ్గితే తమ పలుకుబడి హెచ్చించుకోవాలని అన్నారు ఆ విధానాన్ని చక్కగా అవలంబిస్తున్నారు.

ఆర్థికమయిన ఇబ్బందులు ఉన్నంత కాలం కమ్యూనిస్టులు వాటిని తమ ప్రయోజనానికి వాడుకుంటారు, వారు చెప్పేది ఒకటీ, చేసేది మరొకటీ అయినప్పటికీ

విదేశ విధానాలలో కమ్యూనిస్టులు కొన్ని బూర్జువా ప్రభుత్వాల విధానాలని చూసి హర్షించవచ్చు. దేశంలో వారి విధానాలు మాత్రం మారవు.

వారితో సహకారం అనేది మిధ్య ఈ సంగతి ప్రజాస్వామ్య పద్ధతులని అనుసరించే జాతీయ పక్షాలు గ్రహించాలి. ●

# ఎప్పటినుంచి మిగులు? ఎవరి మిగులు?

1954–55 లో 'తెలంగాణా' (అప్పటి హైదరాబాదు రాష్ట్రం) బడ్జెట్ లోటు సుమారు 50 లక్షల రూపాయలు.

1955–56 లో అదే ప్రాంతం




బడ్జెట్ లోటు సుమారు 1.7 కోట్ల రూపాయలు.

'విశాలాంధ్ర' లేక 'ఆంధ్రప్రదేశ్' 1956 నవంబరులో ఏర్పడింది. అప్పటికే హైదరాబాదు రాష్ట్రం లెక్కలు (ఏప్రిల్‌నుంచి) 7 నెలలవి. 'విశాలాంధ్ర' రాష్ట్రం ఏర్పడిన తర్వాత సుమారు 5 నెలల లెక్కలే కలిశాయి. 1956–57 సంవత్సరం సరిదిద్దిన అంచనా ప్రకారం బడ్జెట్ లోటు సుమారు 2.25 కోట్ల రూపాయలు. కింది పట్టీలో ఇవే అంకెలు ఇవ్వబడి ఉన్నాయి




'తెలంగాణా బడ్జెట్ లోటు

1954-55...... రు 0 5 కోట్లు

1955 56...... రు. 1.7 కోట్లు

ఈ లెక్కలనిబట్టి తెలంగాణా ప్రాంతం ఎప్పుడూ పెద్ద మిగులు ప్రాంతం కాదని గ్రహించవచ్చు.

తమకే మిగులు తేలినప్పుడు ఆంధ్ర ప్రాంతానికి ఎక్కడ ఇచ్చారు!




మిగుళ్ల సంగతి అలా ఉంచి 1956 కాలంలో హైదరాబాదు లేక తెలంగాణా ప్రాంతపు ఆర్థిక — సాంఘిక పరిస్థితి ఎలా ఉండేది ఒక దశాబ్దం తర్వాత — అంటే, 1966 ప్రాంతానికి — ఎలా ఉండేది?




## అక్షరజ్ఞానానికి సంబంధించిన లెక్కలు (శాతములలో)






# ప్రాథమిక, ప్రైమరీ విద్యార్థుల సంఖ్యలు (లక్షలు)




1966-67
ఆంధ్రప్రాంతం

1956-57

1966-67
తెలంగాణా

ఈ పేజీలనిండా వేసిన బొమ్మలు నిజమయిన పరిస్థితి స్వరూపాన్ని తెలుపు

## వరి ఉత్పత్తి సంఖ్యలు (1964-65)




మొత్తం ఉత్పత్తి
43.08 లక్షల టన్నులు

ఈయి; ఒక దశాబ్దంలో తెలంగాణాలో జరిగిన అభివృద్ధిని తెలుపుతాయి.

పోల్చిచూడటానికని ఇదే కాలంలో ఆంధ్రప్రాంతంలో జరిగిన అభివృద్ధి అంకెలు కూడా కొన్ని ఇవ్వటం జరిగింది.

చదువు, విద్యుచ్ఛక్తి ఉత్పత్తి వాడకం, రవాణా, పరిశ్రమలు, సమాజాభివృద్ధి పథకాలు— ఇవే ఒక

## ఎకరానికి పంట విలువ
[illegible]




ఆంధ్రప్రాంతం తెలంగాణా

దేశం లేక ప్రాంతం అభివృద్ధి చెందినదా లేదా అని తెలుపగలవు

నయిజాము పరిపాలనకింద 'తెలంగాణాలో' చదువుకున్నవారి సంఖ్య చాలా తక్కువ విద్యుచ్ఛక్తి ఉత్పత్తి/వాడకం కూడా తక్కువ.

ఇక పరిశ్రమల విషయంలో హైదరాబాదు నగరం, మరికొన్ని ఊళ్లలోనూ కొన్ని కర్మాగారాలు కొంతకాలంగా ఉండేవి సమాజాభివృద్ధి పథకాల సంగతి చెప్పనే అక్కరలేదు! చదువే చెప్పించనప్పుడు సమాజాభివృద్ధి ఏమిటి?

చదువుకి సంబంధించిన ఒక పట్టీ ఈ కింద చూడవచ్చు.

హైదరాబాదు లేక తెలంగాణాలో అక్షరజ్ఞానానికి సంబంధించిన శాతం సంఖ్యలు

| 1931 | 1941 | 1951 | 1961 |
|---|---|---|---|
| 4.0 | 6 9 | 9.4 | 16.1 |

చివరి 16 1 లోనూ హైదరాబాదునగరం భాగం ఎక్కువ; హైదరాబాదులో అక్షరజ్ఞానం శాతం 34 9 అయితే మిగతా తెలంగాణాలో 12 8 మాత్రమే (ఆంధ్రప్రాంతం అంకె 23.3 శాతం)

కాని, ఈ 10.1 శాతం సాధించటానికి ఎన్ని పాఠశాలలు తెరవవలసివచ్చిందో వ్యాసంలోని బొమ్మలే తెలుపుతాయి

## విద్యుచ్ఛక్తి: ఉత్పత్తి సంఖ్యలు




## నీటిపారుదల వ్యయం
[illegible]




1956-69 కాలంలో మొత్తం వ్యయం రూ 210.54 కోట్లు

[illegible] 1956 — 57 [illegible] 545.

స్కూళ్లు ఇక తెరుస్తారు. యూనిఫారము మాటేమిటి మరి?
గమనించాలి బిన్నీవారు మాత్రం ఆ విషయం
మరచిపోలేదు-మీరు మరచిపోయినా.
జ్ఞాపకం వుంచుకోవలసినది
బిన్నీ కేస్‌మెంట్ B 380.
నెలల తరబడి ఎంత చెడవాడినా అందంగా
రంగు దిగకుండా వుంటాయి.
ఇంతేకాదు: ఫర్నిషింగు బట్టలకు, కుషన్ కవరులకు
అనేకవర్ణశ్రేణిలో గుమ్మాలతెరలకు.

# బిన్నీ
# కేస్‌మెంట్
# స్కూలు యూనిఫారములకు




ఈ సైన్‌బోర్డు ప్రదర్శించే బిన్నీ అధికార నియుక్త డీలరు వద్దనుండి మీ అవసరాలు తెప్పించుకోండి.

## బిన్నీ-బట్టలకు పెట్టినది పేరు

BY-5026

# భర్తను లొంగదీసుకోవడము ఎలా?

పరిమళా సోమేశ్వర్

అసలు సీత, సావిత్రి, అనసూయ, సుమతి మొదలైన పతివ్రతల కథలు ఎందుకు ప్రచారంలోకి వచ్చేయో తెలుసా? స్వార్థపరులైన పురుషులే ఆ కథలన్నీ ప్రచారం చేస్తున్నారు. నిజం. అవన్నీ నిజంగా జరిగినాయని నమ్మే బీసీకాలం నాటి అమ్మమ్మలు మీలో కొందరున్నారని నాకు తెలుసు. వాళ్ళకోసమే ప్రత్యేకం నేను చెప్తున్నాను.

స్త్రీ సహజంగా స్వభావసిద్ధంగా ఎటు వడితే అటు వంగే లత! వేరే పాతివ్రత్యాన్నిగూర్చి నూరిపొయ్యాలా? సోదాహరణంగా వివరించాలా? చెడిపోయే కొద్దిమంది ఆడవాళ్ళు ఏ కాలంలోను ఏ దేశంలోనూ ఉండనే ఉంటారు. పతివ్రతల కథలు వాళ్ళముందు చదివి వినిపించటం చెవిటివాడి ముందు శంఖం ఊదినట్లే! ఆ సంగతి వాళ్ళకూ — అదే మగవాళ్ళకూ తెలుసు. అందుకే వాళ్ళ మానాన వాళ్ళను వదిలేసి అమాయకులు, అతి మంచివాళ్ళు అయిన భార్యలకే ఆ పాతివ్రత్య సాహిత్యాన్ని నూరిపోయటానికి ప్రయత్నిస్తుంటారు. లోకంలో ఉన్న తంతేగా యిది. ఎవరికైనా మెత్తని వాళ్ళను చూస్తే మొత్తబుద్ధి అవుతుంది నిజంగానే! అందుకే తీరి కూర్చుని మంచి వాళ్ళను మరింత మంచివాళ్ళుగా, వ్యక్తిత్వాన్ని ఆలోచనా శక్తిని కోల్పోయేంత మంచివాళ్ళుగా తయారుచేసి నోరెత్తకుండా తమ అన్యాయాలను ప్రతిఘటించకుండా జాగ్రత్త పడుతుంటారు మగవాళ్ళు. ఎంతైనా మగవాళ్ళకి దూరదృష్టి ఎక్కువ. ఈ దూరదృష్టి లోపాన్ని తగ్గించి సమదృష్టిని వాళ్ళకు ప్రసాదించాలంటే మంచి కళ్ళజోడుచేసి తగిలించాలి. తగిలించి చూడండి.




ఇంతకీ అసలు సంగతి దాటేస్తున్నాను. పతివ్రతలను గురించి మాట్లాడుతున్నాం కదూ? ఫర్ ఇన్స్టెన్స్—సుమతి కథనే తీసుకోండి. ఆవిడనుగురించి మీరు పుస్తకాల్లో చదివే ఉంటారు. సినిమాల్లోకూడా చూసే ఉంటారు. ఆవిడ మహాయిల్లాలు. గొప్ప పతివ్రత. సూర్యచంద్రులనే నిలిపివేయగల శక్తిమంతురాలు. ఎందుకో తెలుసా? ఆవిడ తన భర్తని ప్రేమించటం వల్లనే ఆవిడ కంతటి శక్తి లభించిందట.

మరి ఆవిడభర్త ఎలాటివాడో చూడండి. ఆయన కుష్ఠురోగి. అంతకన్న భయంకరమైన నైతిక కుష్ఠురోగం (Moral lepracy) ఆయనలో ఉంది. ఆయన రసికత్వానికి భార్య చాలలేదుట. రోజూ ఒక వేశ్యయింటికి పోతూండేవాడు. తన దారిన తాను పోయినా ఫరవాలేదు. పెళ్ళాం రోజూ బండిమీద కూర్చోపెట్టి యీడ్చుకుంటూ వెళ్ళి వేశ్య యింటిముందు దింపి రావాలిట!

ఇదంతా వింటూ మీరు 'ఆహా!' అని తన్మయత్వంలో ఎలా పడిపోగల్గుతున్నారు? మీరు మనుషులుకారా? మీ రక్తనాళాల్లో ప్రవహించేది రక్తమా, లేక మూసి నదిలోని మురికినీళ్ళా? ఏం మాట్లాడరేం? కొస్త బుర్ర ఉపయోగించి (అలాటి దేదైనా యింకా మీలో మిగిలిఉంటే) ఆలోచిస్తే యీ కల్పితగాథ వెనక ఎంత గూడుపుఠాణీ ఉందో మీకే తెలిసివస్తుంది. మగవాళ్ళలో నూటికి డెభ్భైమంది వరకు చంచల స్వభావులు, నీతిదూరులూను.

తమలోని పరస్త్రీ వ్యామోహానికి భార్యలు దోహద మివ్వాలనీ, వీలైతే మనస్ఫూర్తిగా ప్రోత్సహించాలనీ వాళ్ళభావం.



దానిని గట్టిగా పైకిచెప్పే దమ్ములు లేక సుమతిలాటి పతివ్రతల కథలను సృష్టించి మిమ్మల్ని మోసం చేస్తున్నారు

అమాయకులకు చిన్న పిల్లలకు మంచిగా ఉండమని నీతిబోధ చేసేటప్పుడు ఆ మంచి తనంవల్ల లభించే లాభాలుకూడా చెప్పటం రివాజు. అలాగే సుమతి అంత గొప్ప స్త్రీ కావటానికి, సూర్య చంద్రులనుకూడా గతులు తప్పేట్టు చేసుగల్గటానికి ఆవిడ భర్తచేసే నీచకార్యాలను నోరెత్తకుండా సహించటమే కారణమని చెప్తారు మగవాళ్లు.

మీరా పుక్కిటి పురాణాలు నమ్మవద్దు. నిజమైన పతివ్రత చెడుత్రోవను పోయే భర్తను సంస్కరించాలి కాని, సహించటంకాదు చెయ్యవలసింది. సుమతి అనే స్త్రీ నిజంగా ఉండి, ఆవిడకనుక నయాన్నో భయాన్నో భర్తచేసే పనులను మాన్పించి నట్లయితే ఆవిడ పేరును మగవాళ్లిలా సువర్ణాక్షరాలతో లిఖించి డబ్బా వాయించే వారుకాదు. ఇప్పటికైనా అర్థమయిందా యీ పతివ్రతల కథల వెనుక పురుషుల స్వార్థం ఎంత దాగి ఉందో!

ఇంకో విషయంకూడా గమనించండి. వింతసేపూ మన పురాణాల్లో శీలవతులను గూర్చిన ప్రశంసలే తప్ప శీలవంతులైన పురుషులను గూర్చి ఒక్కడూ వ్రాయడే? పతివ్రతల లిస్టును గనుక తయారు చేసినట్లైతే సీత, సావిత్రి, దమయంతి, సుమతి, అనసూయ, లక్ష్మి, సరస్వతి, శ్రీదేవి, భూదేవి...అంటూ ప్రతి స్త్రీకూడా పతివ్రతే! కాని అదే మగవాళ్లలో ఎన్నిసార్లు చూసినా శ్రీరామ చంద్రుడు, ప్రవరాఖ్యుడు తప్ప మరో ఏక పత్నీ వ్రతుడు కంచుగాగడా వేసి వెతికినా కనిపించడే? దీనికి కారణం యేమిటో తెలుసా? అవన్నీ- మగవాళ్లు కల్పించిన కథలు కనుక ఎంతసేపూ వాళ్లు స్త్రీల పాతివ్రత్యాన్నిగూర్చి నొక్కి చెప్పేరే తప్ప, తాముకూడా అంత పవిత్రంగానూ ఉండాలన్న ఆలోచనకి తావీయలేదు.

శీలం అనేది పురుషులకూ, స్త్రీలకూ యిరువురుకీ ముఖ్యంగా కావలసిన గుణమే. మిగతా జంతువులనుండి, ఆదిమజాతిమానవులనుండి నాగరికులను వేరుచేసేది యీ నైతిక శక్తే! ఇది కేవలం స్త్రీలకే




ఉండాలని; పురుషులకు అక్కర్లేదని అనటం హాస్యాస్పదమే కాక, అలా అనే వారి సంకుచిత మనస్తత్వాన్ని కూడా తెల్పుతుంది.

ఆ శ్రీరాముడు, ప్రవరాఖ్యుడు కూడా ఆయా గ్రంథాలలో స్తుతింప బడ్డారంటే దానివెనుక చాలా 'భాగోతం' నడిచే ఉంటుంది. ఎంత ఆడవాళ్లైనా, బుర్ర లేని మొద్దులైనా మరీ అదేపనిగా పతివ్రతల కథలు ఏకరువుపెడితే విసుక్కుంటారేమోనని వాళ్ల కళ్లనీళ్లు తుడవటానికి వాల్మీకి శీలవంతుడైన పురుష పాత్రను ప్రవేశపెట్టదల్చుకుని శ్రీరామ కథను వ్రాసేడని నా నమ్మకం.

ఐతే నాయీ కొద్ది ఆశాభావాన్ని కూడా సడలించిన ఒక భయంకర సత్యాన్ని యీ మధ్యనే గుర్తించటం జరిగింది — అదేమంటే అసలు సంస్కృతంలో వాల్మీకి వ్రాసిన రామాయణంలోని శ్రీరామచంద్రుడు ఏకపత్నీవ్రతుడు కాదని, సీతాదేవి కాక యింకా పధ్నాలుగు వందలమంది(?) భార్యలాయనకి ఉన్నారనీ సోదాహరణంగా నిరూపించేరు ఒక సాహితీ విమర్శకుడు. దాంతో శ్రీరామచంద్రుడి ఏకపత్నీ వ్రతం వట్టి హంబగ్ అని తేలిపోయింది.

ఇకపోతే ప్రవరాఖ్యుడి కథమీద వాకాట్టే నమ్మకం లేదు. ఎంత నిప్పుమీద నీళ్లు జల్లుకునే బ్రాహ్మడైనా వలచి వచ్చిన గాంధర్వకన్యతో ఏకాంతంగా ఉండికూడా మడిగట్టుకు కూర్చుంటాడంటే నేనుచస్తే నమ్మను. అల్లసాని పెద్దనగారిని ఆయన భార్య పోరి అలా వ్రాయించి ఉంటుంది. వాస్తవిక జీవితంలో ఎటువంటి అంతటి నిగ్రహశక్తిగల పురుషులుండరు గనుక అలాటి పాత్ర ఒకటి తన భర్తకలందర్వారా నైనా శాశ్వతంగా నిల్చిపోవాలని ఆ కవి పత్ని ఆశించి ఉంటుందని నా ఊహ.

మనవాళ్ల దృష్టిలో ఏమైనా స్త్రీకి గౌరవం అంటూ ఉంటే అది తల్లిగానే! 'మాతృదేవోభవ' అంటూ తల్లికి అత్యున్నతమైన స్థానాన్నిచ్చేరు. కాని భార్యగా అలాటి పూజకు ఏస్త్రీకూడా అర్హురాలు కాదని మగవాళ్ల దృఢ విశ్వాసం.

అందుకే భార్యని గురించి చెప్పే

టప్పుడు 'కార్యేషుదాసీ, కరణేషు మంత్రీ, భోజ్యేషు మాతా, శయనేషురంభా...' అంటూ చెప్పేరేకాని భార్యని ఆరాధ్యురాలిగా ఎక్కడా వివరించలేదు. పైగా ఆ పై వాక్యాలలోని వరుస క్రమం చూడండి. ముందు భార్య పురుషుడుకి దాసి, తరువాత మంత్రి, అంటూ మాతృస్థానానికి చాలా తక్కువ ప్రాధన్యతనిచ్చేరు. పైగా సేవకురాలిగా సలహాదారుగా మాత్రమే భార్యకు మొదటి స్థానాల నిచ్చేరు. ఇంతటి దారుణాన్ని సహించటం సాధ్యమేనా?

ఇంకా మనవాళ్ళే ననుకుంటే క్రైస్తవులో మహమ్మదీయులలో స్త్రీ కున్న స్థానం మరింత హీనమైనది. ఎంతగా భార్య భర్తకు లొంగి ఉండాలని నొక్కి చెప్పినా కనీసం స్త్రీనికూడా వ్యక్తిగా మనసు, ఆత్మ ఉన్న మనిషిగా గుర్తించేరు మనవాళ్ళు.

ఆడమ్, ఈవ్ ల కథ మీరు వినే ఉంటారు. అందులోకూడా స్త్రీ కేవలం భర్త సేవకోసం ఆనందంకోసమే పుట్టిందనీ, ఆమె పురుషుడిని పూజించాలనీ, పురుషుడు దేవుడిని పూజించాలనీ ఉంది. 'ఆమె అతనికోసం, అతను దైవంకోసం' (She for him and he for God) ట!

ఇంతకంటె దారుణమైన విషయమేమంటే కొన్నివేల సంవత్సరాల క్రితం క్రైస్తవ మతాధికారులందరూ ప్రపంచం నలుమూలలనుంచీ వచ్చి ఒకచోట సమావేశమై స్త్రీకి ఆత్మ అనేది లేదనీ, ఆమె కేవలం ఆటవస్తువు వంటిదనీ పురుషుడిని ఆనందపర్చటానికే ఆమె జన్మించిందనీ ఏకగ్రీవంగా తీర్మానించేరట! ఐతే యిది మొదటిసారిగా చదివినప్పుడు నాకు రావలసినంత కోపం రాలేదు. స్త్రీ ఆత్మ రహితురాలు కనుకనే భక్తిలేని చప్పిడి పీనుగ కనుకనే మగవాడి ఆటలు సాగుతున్నాయనీ అతని ఆకతాయితనానికి అడ్డువేది లేకుండా పోతోందనీ అనిపించింది నాకు.

దైవకార్యాల్లో స్త్రీ పురుషులకు సమానార్హతలుండాలన్న విషయంపై మనవాళ్ళకేం అభ్యంతరం ఉన్నట్టు కపడదు. కాని మహమ్మదీయులలో స్త్రీలకు దేవాలయాలలో (మసీదు) ప్రవేశం లేదు. అంటే స్త్రీకి ప్రశాంతంగా మసీదులో దైవాన్ని ప్రార్థించేపాటి స్వేచ్ఛకూడా వాళ్ళ మతం యివ్వలేదన్న మాట!

ఇదే విషయాన్ని గురించి నేను గట్టిగా గొంతు చించుకుని వాదిస్తుంటే మా ఆయన 'చిక్కడపల్లి వెంకటేశ్వర స్వామి దేవాలయానికి సాయంత్రంపూట ఆడా, మగా అందరూ వస్తుంటారు. దైవ దర్శనం పేరిట వచ్చే అమ్మాయిల తళుకులు, కులుకులు అబ్బాయిల వెకిలి చేష్టలు చూస్తుంటే అంతకంటే మహమ్మదీయ స్త్రీలలోని అస్వతంత్రతే మంచిదనిపిస్తోందోయ్! అసలు యిలాటి అప్రసన్నకరమైన స్థితి రాకుండా ఉండటానికే వాళ్ళా నియమం పెట్టుకున్నారేమో!' అన్నారు. చెప్పొద్దూ. ఎంతైనా మళ్ళా నోరెత్తి ఆ టాపిక్ ని కొనసాగించటానికి ధైర్యం చాల్లేదు నాకు. ఐనా వెంటనే ఆయన అన్న విషయాన్ని 'అవు' నని ఒప్పుకోవటానికి నాలోని 'ఆడతనం' అడ్డురావటంవల్ల ఆ మాటలు విననట్లే నటించి అక్కడనుంచీ వెళ్ళిపోయేను.

(మై కారం తర్వాతలో రకాలు)

బి. కె. ఆర్, కొక్కిరాల

మీరు ఉదయం లేవగానే ఏం చేస్తారు సిస్టర్?

పళ్ళు తోమి పాలుకి పదును పట్టడం ప్రారంభిస్తాను సోదరా.

టి. ఐ, కాకినాడ

...ఇలా ఉన్న మా సంసార బాధలు వెలిబుచ్చి యిస్తారని ఆశిస్తున్నాను.

ఈ లేఖకి జవాబు ఓ వ్యాసం వ్రాయాలి సోదరీ, ఉద్యోగినుల సాధకబాధకాలు ఆఫీసుల్లోనూ యింట్లోనూ కూడా ఉంటాయి. మగవాడికి ఒక్క ఆఫీసులోనే ఉంటాయి. అదే వచ్చిన చిక్కు.

కె వి ఆర్, గుడివాడ

కనీసం మీ సలహా సంఘంలో ఉన్న రచయిత్రులంతా కూడా సభలకు రారేం సోదరీ.

సలహా సంఘ సభ్యత్వం వారికి గౌరవప్రదమే గాని నలుగురితో కలసి పాల్గొనడం చేతకాదు.. బహుశా అందుకే ననుకుంటాను సిస్టర్—రారు. సలహాసంఘ సమావేశాలకి హాజరవుతారు. సభల్లో సమావేశాల్లో పాల్గొనరు. అందుకే అలా తోచింది మాకు.

ఎమ్. ఎన్, కాకినాడ

కాపీ రచనలు ఆడాళ్ళు చేస్తారెందుకు?

అలా కాపీకొట్టేది లేదే. సోమర్‌సెట్ మామ్‌ని, షేక్‌స్పియర్‌ని, వైల్డ్‌ని, విలియమ్ సారోయన్ని, ఉడ్‌హౌస్‌ని, హెన్రీ మూర్‌ని, ఓహెన్రీని, అత్యద్భుతంగా సొంతం చేసుకున్న ఎందరో మహానుభావులని వదిలేస్తారెందుకు?

సి. హెచ్. ఆర్. ఎల్, డొంకరాయి

మావారు ఇంటికి రాగానే చాలా చిరాకుగా ఉంటారు. నేను వారితో మసలుకోవడం ఎలాగో చెప్పండి.

నా పేరింటికత్తెవి — ఆమాత్రం డిప్లొమసీ లేకపోతే ఎలా? ఆఫీసు వాతావరణం ఆ పూట ఎలా ఉందో— ఇంటికి వస్తూనే కంప్లయింట్ల జాబితా ముఖాన పెడతారు చాలామంది. మండిపడక, తప్పదా మగవాడు.. ఎనికైనా సమయం సందర్భం కొంచెం ఆలోచించాలి సోదరీ.

ఎమ్. ఆర్. జి. ఎస్, కడప

నా చేతివ్రాత బాగుండదు. మన్నించాలి. నా రైటింగ్ అర్థంచేసుకోగలిగితే మీరిక మహా కవయిత్రులలో లెక్క. సరేనా?

సరిసరి. నా చేవ్రాత అర్థం చేసుకోకల్గే కంపోజిటర్ దొరికితే—అయితే. సరేనా?

ఎస్. హెచ్. ఆర్, టిటాఘర్

నేను మెట్రిక్యులేషన్ పరీక్షకు కడుతున్నాను. ఇచట క్లాసులో ఒక అమ్మాయిని ప్రేమించాను...




ఎవరేనా వింటే నవ్వుతారు. మెట్రిక్ చదివేటప్పుడే ప్రేమిస్తే ఉద్యోగం వచ్చేసరికేం మిగలదు...చదు పూర్తిచేసి ఆర్థికంగా స్వతంత్రులైన వారికే ప్రేమించే హక్కు.

కె. వి. ఎస్, తణుకు

విడివడి దూరమవబోతున్న మా హృదయాలను యీ ప్రశ్నావళి ఒకసంధి రాయబారి కాగలదనే ఆశతో...

సంధికార్యహితుడెప్పుడూ ... పైవాడుండాలి. లేకుంటే కృష్ణరాయబారమే అవుతుంది... 'యుద్ధము తప్పదు' ఆలోచించుకోండి స్వామీ.

డి. కె. ఆర్, పురిని—నెల్లూరుజిల్లా

ప్రస్తుత ప్రేమ వివాహాలు వర్ణాంతర కులాంతర వివాహాలు, విధవా వివాహాలపై మీ అభిప్రాయమేమి?

బాగానే ఉంటున్నయే.

జి. ఆర్. డి, భీమవరం

ఏవో ఆదర్శాలు ఆశయాలు పెట్టుకుంటే బ్రతుకు సాగేటట్టు లేదండీ.

అంతమాత్రంచేత వాటిని ఎప్పుడూ వదలకు సోదరీ, అవి వదిలాకకూడా బ్రతక్క తప్పదు. అవిలేని బ్రతుకు బ్రతికీ ప్రయోజనం ఉండదు.

జి. ఎస్. ఆర్, విశాఖపట్నం

... మెడిసిన్ చదువుతున్నాను ... పదహారవ ఏటినుండి కథలు వ్యాసాలు కాక, యింకా అనేక రచనలు చేస్తూ వస్తున్నాను ... ఈ సాహిత్యానికి ఎవరైనా ఆశ్రయం యిస్తే బాగుండుననే నా ఆవేదన...ఇప్పుడు ఏం చేయమంటారు?

[illegible] కథలు, నవలలు, పాటలు, గేయాలు అవన్నీ ఎందుకూ కొరగాకుండా పోవలసిందేనా?...

పాపం పసివాడివి! ఊకరకు కట్టిన ప్రపంచంలో సున్నితమైన నీ మనస్సు దెబ్బతింటోంది, నీ కథలు, నవలలు గేయాలు కవితలు అచ్చుపడక. అంతేనా? ముందు ఐదేళ్ల చదువు ఆరుయేళ్లలో ముగించి తరువాత ఈ సాహిత్య తపస్సుచేయకూడదా అబ్బాయీ.. నువ్వు డాక్టరువై రాస్తే వాటికి విలువ వేరు. 'అచ్చేసుకోండోయ్' అంటూ ప్రాధేయ పడ్డానికి చాల పౌరుషం ఉండాలి... 'మొదటి పనులు మొదట' అన్నది జ్ఞాపకం ఉంచుకుని బ్రిలియంట్ కెరీర్ సృష్టించుకోండి ముందు.

ఎ. డి. ఆర్. ఆర్, మంగళగిరి

నా భావాలను రచన రూపంలో వెలువరిద్దామని ప్రయత్నించాను. అన్నీ అసంపూర్తిగా మిగిలిపోయినవే. తీరా ముగిద్దామనుకునే టైముకి ఎక్కడలేని బద్ధకం వస్తుంది...విరుగుడు చెప్పరూ...

పెద్ద రచయితల్లాగా ఓ ఘోస్టు రచయిత చేత ముగించుకోమని చెప్పవచ్చు. లేదా ముగించకుండా రచన ఆపనని నిర్ణయించుకోమని చెప్పవచ్చును.... మరి మీయిష్టం.

ఎల్. డి. ఎస్, బళ్లారి

కఠినమైన ఈ రోజుల్లో కనీస ఖర్చుతో తయారయే వంటలు ఏమైనా ఉంటే చెప్పకలరా?

సర్వసాధారణంగా దొరికే ఆకుకూరలు, చవుకరాగులు చోళ్ళు జొన్నలతో రకరకాల వంటలు చేయడం చవుక. ఉన్న వాటినే వీలైనంత వరకు పోషక పదార్థాలు పోకుండా వండడం కూడా చవుకే. గృహిణికి ఈ చిట్కాలన్నీ తెలియాలి. తెలియగానే సరికాదు. అమలులో పెట్టాలి. వంటలో విసుగు రాకుండా తినడానికి మొఖం మొత్తకుండ ఉన్నవాటినే రకరకాలుగా వండే నేర్పు సామాన్య గృహిణి సంపాదించాలంటే రోజువారీ వంటకు ఓ పథకం వేసుకోవాలి. ఓ వారానికి వంటలు ప్లాను చేస్తే సరి ....పోయి.

పి. ఏ, హైదరాబాదు

రచయిత స్వంతంగా పుస్తకాలు ప్రచురించుకోవాలంటే ఏమి చెయ్యాలి?

ఏ ప్రెస్సు వారికైనా వ్రాతపతి చూపితే ఖర్చు ఎంత అవుతుందో చెప్తారు. అచ్చువేసి యిస్తారు. ఇంక ఆ కాపీలని అమ్మడం అంటారా మాకు తెలియని సంగతి!!

# వెలుగు నీడలు

యలమంచిలి ఝాన్సీలక్ష్మి

సీరియల్



**జరిగిన కథ**

రాజశేఖరంగారి ఒక్కే ఒక కూతురు అనుపమ ఆయన మిత్రుని కుమారుడైన మధుని ఆదుకుని తన యింటల్లోనే ఆశ్రయం యిస్తారు మధుమూర్తి అనుపమ అభిమానాన్ని పొందుతాడు రాధా మాధవీయం నృత్యనాటికతో వారి అనుబంధం మరింత దృఢం అవుతుంది విదేశాలనించి వచ్చిన అనుపమ బావ విజయకుమార్ వీరి అభిమానాన్ని సహించలేడు మధుమూర్తి ఊరికివెళ్లిన అనుపమ అక్కడ మాధవినిచూసి అపార్థం చేసుకుంటుంది జరిగింది వివరిస్తాడు మధు విజయకుమార్ బారి నుండి అనుపమ శీలాన్ని రక్షిస్తాడు మధుమూర్తి అనుపమ మధుల అనుబంధం విడదీయరానిదిగా రూపొందుతుంది

## 7

మధుమూర్తికోసం ఆ రోజంతా నిరీక్షించుతూనే వుందామె చీకట్లు కమ్ముకున్నా అతని జాడే లేదు నౌకర్ని పంపించింది అతడు వచ్చి 'బాబుగారు పడుకున్నారు! కొంచెం జొరంగా వున్నారు' అన్నాడు

అప్పటికింకా రాజశేఖరంగారు రానేలేదు ఏ పది గంటలకోగాని ఆయన రారని నౌకరు వచ్చి చెప్పి వెళ్లాడు

కారు యింటిదగ్గరే వుంది. డ్రైవర్ని పిలిచి బయలుదేరిందామె

మధుమూర్తి రూమ్‌దగ్గర దిగి కారును పంపించివేసింది, ఆలస్యమైతే నాన్నగారితో ఇక్కడేవున్న సంగతి చెప్పమని

ఓ పన్నెండేళ్ల అమ్మాయి 'స్టౌ' మీద కాఫీ పెడుతోందపుడే

మధుమూర్తి మంచంమీద పడుకుని వున్నాడు అనుపమను చూడగానే చిన్నగా నవ్వుతూ లేచి కూర్చున్నాడు.

'వస్తావని అనుకుంటూనే వున్నాను! రజనీ! కాఫీ మరో గ్లాసుడు ఎక్కువ పెట్టమ్మా!' అన్నాడు

'కాఫీకోసం రాలేదులెండి! ఇంతకూ ఎలావుంది ఒంట్లో?'

'జ్వరంగా వుందిప్పటివరకూ! కానీ యిక వుండదులే!'

'ఎందుకని?' విస్మయత విందుకొచ్చిందామె నేత్రాల్లో

'అనుపమ వచ్చిందీ అనగానే భయమేసిందేమో! పాపం! పారిపోయింది'

అంతలో ఓ కుర్రాడు కవరొకటి తెచ్చి యిచ్చాడు 'ప్రొద్దునే వచ్చిందట! అమ్మ మరిచిపోయింది యివ్వడం' అంటూ

రజని కాఫీగ్లాసులు తెచ్చి యిద్దరి ముందు వుంచింది

'నాకు వద్దమ్మా! నువ్వు త్రాగు!' అన్నది అనుపమ

'మాస్టారికి వుంచుతానులెండి! మరో సారి త్రాగుతారు' అంటూ ఫ్లాస్కు కడిగి పోసింది.

'అమ్మతో చెప్పమ్మా! రజనీ! డబ్బు లేవు కొన్ని వర్ధమని' అన్నాడతడు.

ఆ అమ్మాయి వెళ్లినతర్వాత అడిగింది అనుపమ

'ఇదేమిటి? ఎంతమందికి చెబుతున్నారేమిటి ట్యూషను?'

'కోపగించకు మరి నిజం విని! మొత్తం ఆరుగురు వస్తున్నారు!'

'సరే! కాస్త ఆ వుత్తరం చదువు!' అన్నాడతడు కాఫీ త్రాగుతూ

తల్లి వ్రాసిందా వుత్తరం మధుమూర్తి అక్క శారద పుట్టింటికి వచ్చిందనీ, ఆమెభర్త పెలరోజులనుంచి కంటికి కన్పించకుండా పోయాడనీ, మాధవి పరిస్థితి అలాగే వుందనీ వ్రాసింది

చివర శారదను హాస్పిటలికి తీసికెళ్లి మందు లిప్పించాలనీ ఆరోగ్యం ఏమీ బావుండ లేదనీ, వీలుమాని ఓ వంద రూపాయలు సాధ్యమైనంత త్వరలో పంపించమని వ్రాసింది

'ఊ! అమ్మ మరీ కష్టపడిపోతోంది. ఈ జీవితసంధ్యా సమయాన విశ్రాంతి లేకుండా కోవలసిందిపోయి' బరువుగా నిట్టూర్చా

డతడు.

అస్వస్థత మూలానా అతని ప్రయాణం ఆగిపోలేదనీ, ఆర్థికంగా పరిస్థితులను కూలించక పోవడంవలనే ఆగిపోయాడనీ గ్రహించి అనుపమ అతని అభిమానానికి ఆగ్రహమూ ఆశ్చర్యంకూడా అలలై లేచి పడ్డాయి.

'మరీ యింత కఠినులైపోయారేమిటి? అనుపమ అన్నమనిషి వున్నదన్నైనా జ్ఞాపకం వుండదా మీకు?' నిస్సహాయత నిండి పోయిందామె కంఠాన.

'నాకుతెలుసు అనూ! నీ బాధ! కానీ ఆ సహాయం అందుకోలేరే మాష్టారు తన అనుపమనుంచి. అది మన మృదువైన అనుబంధాన్ని తెంచివేస్తుంది' అన్నాడతడు మృదుస్వరంతో.

ఆ జవాబు విని పెదవి కదల్చలేక పోయిందామె ఆశ్చర్యంతో. తన ఎదుట వున్నది మనిషిగా కన్పించడం లేదామెకు. అభిమానానికీ, అనురాగానికీ ఆలయంగా పిండిపోయాడామె కనులలో. క్షణమాత్రం ఆగి అన్నది.

'ఇలాగే నోరుమూసి వేస్తూండండి ప్రతిదానికీ, సర్వనాశనం అయ్యేవరకూ! తీరిగ్గా అనుబంధాల్ని పట్టుకుని పాకులాడవచ్చు తర్వాత'

'ఆవేగం, ఆవేశం పెరిగి పూడలు వేస్తున్నాయి అనుపమా నీలో! అర్థం చేసికోడానికి ప్రయత్నించవు గదా!' శాంతంగా వుందతని కంఠం.

ఆమెబాధా, విచారమూ అందుకుగాదనీ; కబురంపి ఆత్మీయంగా సేవా శుశ్రూషల నందుకోనందుకనీ గ్రహించాడతడు.

'రేపు నేను మనియార్డరు చేస్తాను లెండి వద్దంటే మళ్ళీ...'

'నీకు కన్పించడీ మధుమూర్తి' అన్నాడతడామె వాక్యం పూర్తిగాక మునుపే అందుకుని.

ఆశ్చర్యంతో చిత్తరువే అయ్యింది అనుపమ. కాని వెంటనే ఆగ్రహంతో వివశురాలై పోయింది.

'అయితే నేనిక్కడినుంచి కదలనే కదలను' పట్టుదల నిండి వుందామె స్వరంలో.

కనులలో ఆవేశం కేరటాలై విరిసింది. ఆవేగం బాణంలా దూసుకు వచ్చింది.

మధుమూర్తి ఓ నిమిషం వరకూ



మౌనం వహించాడు. లేచికూర్చుని గోడకు ఆనుకుని అన్నాడు—

'నా మనస్సూ అదే కోరుతోంది. కానీ మధుమూర్తి మహామూర్ఖుడని నాన్న గారికి తెలియపరచగలవా మరి?! అప్పుడే చింతాలేకుండా పోతుంది.'

అనుపమ ఆశ్చర్యపోయిందెంతగానో అతని ఆలోచనలతీరుకూ, దూరదృష్టికీ. నిజాన్ని అంత అందంగా, మనస్సు నొవ్వని విధంగా చెప్పినందు కామెహృదయాన అభిమానం అనురాగం కెరటాలై లేచిపడ్డాయి గౌరవంతో పాటుగా—

తిరిగి సమాధానం ఏం చెప్పాలో వెంటనే స్ఫురించలేదు, ముగ్ధ నేత్రాలతో అతనివంకే చూస్తూండి పోయింది.

అంతటి ఆలోచనా పటిమ ఆ వయస్సులోనే ఎలా అలవడిందా అని తర్కవితర్కాలలో నిండిపోయిందామె మనస్సు

'మీరిలాగే సమ్మోహనాస్త్రాల్ని విసురుతూండండి. చేతులు కాలాక ఆకులు పట్టుకుందాం తీరిగ్గా. ఎవరేమనుకున్నా నా నిశ్చయం మాత్రం మారదు' నిశ్చలత నిండి ఖంగున మ్రోగిందామె స్వరాన.

'నేనూ అంత మొండిగా మాట్లాడగలను నీ అనురాగం నాకేమీ విషంగాదు అనూ! తర్వాత నీ మనస్సు యీ మాష్టార్ని ఎంచుకున్నందుకు బాధపడిపోతుందేమోనని ఆలోచించు తున్నాను.'

# వెలుగు నీడలు

'బాధ! బాధ! మనస్సుకు నచ్చిన తోడు వున్నప్పుడు విషాన్నైనా తాగవచ్చు హాయిగా'

'ఆ హాయిలో ఆనందం వుండదు అనూ!'

'ఉండకపోతే వూరేగనివ్వండి. అసలు అనుపమ పేరే మీకు నచ్చటం లేదనుకుంటానే! నిజాన్ని దాయడమెందుకూ?! నన్నిలా మభ్యపెట్టట మెందుకో? నీముఖం చూపించకు! అనరాదూ! పీడ విరగడైపోతుంది' నిష్ఠూరమూ, వ్యంగ్యమూ, బాధా అలలై లేచిపడ్డాయా కంఠం నిండుగా.

కనులలో కన్నీటి కెరటం మెరపులా తళుక్కున విరిసి మాయమై పోయింది.

'మరీ అంత పాషాణంగాదు అనుపమా! యీ నీ మాష్టారు' వ్యథా భరితమైన అతనిస్వరం ఆమె ఆవేదనను కొంతవరకు వుపశమింప జేసింది.

తారా జువ్వలా లేచిపడిన కోపం కొంత వరకు కరిగిపోయింది.

'అయితే! నాకు మాట యివ్వండి! ఎప్పటికైనా అనుపమ మనస్సు మీదేనని' అంటూ చేయిజాపిందామె లేచి నిలబడి.

విభ్రాంతుడయ్యాడతడామె అడిగిన వాగ్దానానికి ఆమె కళ్లల్లోకి చూస్తూ అన్నాడు—

'ఆవేశంతో అనురాగాన్ని బంధించ వేయగూడదు అనూ! సరే! మాటయిస్తున్నాను! మధుమూర్తి ఎప్పటికీ నీ వాడేనని! దీన్నిగురించి మరోమాట విసర వద్దు! మళ్లీ బాధపెట్టవద్దు నామనస్సుని' అంటూ అతడు ఆమెచేతిలో చేయి వుంచాడు.

ఆమె కన్నులనిండుగా ఆనందమూ, సంతృప్తీ మల్లెలై విరిశాయి. తృప్తిగా నిట్టూర్చిందామె మనస్సు.

'వస్తాను! మాష్టారూ! ప్రొద్దుబోయింది!' అని అనగానే అతడుకూడా లేచి నిలబడ్డాడామెను గేటువరకూ సాగనంపాలని.

'రేపు డాక్టరుగారు మీరూమ్‌కే వస్తారు! ఆయనేమన్నదీ దాచకుండా చెప్పండి! కాఫీ వగైరాలు నేనే తయారుజేస్తాను వచ్చి!' అన్నదామె ఆగి నిలబడి.

'అలాగే! ముందు నువ్వు ఇంటికివెళ్ళు! నాన్నగారు ఆదుర్దా పడుతున్నారేమో నీ కోసం!' అంటూ మృదువుగా నొక్కాడామె చేతిని తీసికొని.

'ఉదయాన్నే ఫోనుచేయండి! ఎలా వుందీ! మరిచిపోకండి!'

'పోనీ చెంగున ముడివేసుకుని తీసుకువెళ్లరాదూ! ఈ బాధంతా తప్పుతుంది' అంటూ నవ్వాడతడు చిన్నగా.

'మీకు నవ్వులాటగానే వుంటుంది!'

'అనూ! మరీ యింత పసివాడిలా చూడకు!' అన్నాడతడు మృదువుగా.

'ఆమాత్రం తెలుసులెండి మీ శిష్యురాలికి!'

అన్నదామె వెళ్లిపోతూ.

* * *

ఇంటికి ఓ వందరూపాయిలు పంపించాడతడు రెండోరోజున. జ్వరం పూర్తిగా తగ్గేసరికీ నాల్గురోజులు పట్టింది. అన్నాళ్లూ అనుపమ పరీక్షల మాటకూడా మరిచి సేవా, శుశ్రూషలలో మునిగిపోయింది.

తమ ఫామిలీ డాక్టర్ని ప్రతిరోజూ రప్పించి అతి జాగ్రత్తగా కంటికి రెప్పలా జూచుకుంది మధుమూర్తిని.

పరీక్షలు యిక వారంరోజులున్నాయన్న మధుమూర్తి హెచ్చరికతో చదువులో



విమగ్నమైంది.

అయినా ప్రతిరోజూ ఏ సమయాన్నో ఓ సమయాన మధుమూర్తి రాకపోతే కబురంపించి మరీ రప్పించి ఓ గంట సందేహాలున్నాయంటూ కూర్చోబెట్టి వాదనలతో పరిహాసాలతో నవ్విచుతూనే వుంది

పరీక్షలు పూర్తయ్యేసరికి పదిరోజులు గడిచాయి

ఆనాడే మధుమూర్తి తమవూరికి వెళ్ళాలని బయలుదేరాడు. అంతలోనే అనుపమ వచ్చింది వనదేవతలా.

'దివినుంచి దేవతలు దిగివస్తున్నారే యీ మధ్య!' అన్నాడు మధుమూర్తి ఆమె సౌందర్యాన్ని చూస్తూ ముగ్ధుడై—

'దేవతలు దిగిరానిదెపుడు? కొందరికి అప్పుడప్పుడే కన్పించుతారుగానీ'

'జడ నిండుగా మల్లెలూ! ... కనుల నిండుగా కాటుకా...మరి...మనస్సునిండుగా వున్న...దెవర్?'.

మృదు మధురంగా ధ్వనించిందతని స్వరం.

జీవితంలో అనుపమను చూడటం అదే మొదటిసారి అన్నట్లు ఆ అందాల ప్రతిమ వంకే రెప్ప వాల్చకుండా చూస్తూండి పోయాడతడు.

నిలువెల్లా సిగ్గు మందారంలా విరిసి మనస్సున అనురాగ వీణియను ఝల్లుమన్పించింది.

సుందర విశాలనయనాలను పైకెత్తి అన్నదామె మృదుస్వరంతో—

'మరీ చిలిపి మనుషులై పోతున్నారీ మధ్య'

'మీ ఆడవాళ్ళ నైజమే యింత! మనస్సున వున్నమాట చెబితే నమ్మరు' అన్నాడతడు.

కనుకొలకుల్లోంచి చూస్తూ అన్నదామె —

'స్త్రీల గురించి 'రీసెర్చి', మొదలెట్టాలనుకుంటాను!' -

'అనుకుంటానేమిటి? ఎప్పుడో ఆరంభించాను! కేంద్రమేదో చెప్పనా?'

చెప్పమన్నట్లు చూసిందామె—

'ఇదిగో! ఈ హృదయం!'

'ఎందరికది నిలయం?'

'ఒక్కరికే అది ఆలయం!'

'ఎవరో అక్కడ వున్నది?'

'ఓ చక్కని చిన్నది!'

'పాటలుకూడా వ్రాస్తున్నారేమిటి?'

# వెలుగునీడలు

'ఆహా! మాటల్లో మనస్సు నిలవక!'

'గారడీ చేయగలరమకుంటాను మాటల తోనే!'

'ఎవరినెవరు గారడీ చేస్తున్నారో తెలుస్తూనే వుందిగా? నిజమే! అందంతో ప్రపంచాన్నే వూపివేస్తారు ఆడవాళ్ళు!'

'పొగడ్తలు చాల్లెండియిక! సినిమాకు టైమైపోతోంది! పదండి!' అన్నదామె.

'సినిమా! ఇపుడా? ఎలా అనూ? నేను వూరికి వెళ్తున్నానే?'

'నాన్నగారిని ఒప్పించేసరికి రోజంతా పట్టింది! ఇక మిమ్మల్ని ఎన్నాళ్ళ పొగదీయాలో?' అన్నదామె నిరాశగా.

'సరే! పద! మళ్ళా ఓ ప్రపంచ యుద్ధ మెందుకుగానీ' అంటూ నవ్వుతూ బయలుదేరా డతడు

హాలుదగ్గర అనుపమ స్నేహితురాళ్ళందరూ నిరీక్షిస్తున్నారు వాళ్ళకోసం.

అనుపమా, మధుమూర్తిని చూడగానే పసిపిల్లల్లా గంతులు వేశారందరూ ఆనందంతో. పరీక్షలు ముగియగానే వాళ్ళ ఆనందానికి పట్టపగ్గాలు లేకుండా పోయాయి అందుకే సినిమా 'ప్రోగ్రాం', వేసుకున్నారు.

అంతమంది మధ్యా మధుమూర్తినోరు మెదపాలంటేనే భయపడి పోయాడు.

టికెట్లు తీసికొంటూండగా విజయకుమార్ వచ్చాడు.

'అనూ! మీ బావే!' అన్నదో కంఠం సన్నగా.

అయిష్టత దొరలుతూన్న కళ్ళతో చూసిందామె అతనివంక.

'రండి! రండి! డాక్టర్‌గారూ! మా ఆంధ్రా సిసింద్రీలతో ఓ రెండు గంటలు గడపండి! ఎంతఘాటుగా విమర్శిస్తారో చూస్తాం అప్పుడు?'

అంటూ అతని పాశ్చాత్య నాగరికతా వ్యామోహాన్ని పరిహసించుతూ ఆహ్వానించిందో కంఠం వ్యంగ్యంగా.

'వాట్ ఏమిటివాళ? యింతమంది ఏకంగా బజారుమొహం చూశారు? అదీ! అనుపమా! అదా సంగతి! సరే! పదండి!' అంటూ అతడూ వాళ్ళలో ఒకడిగా కలిసి పోయాడాక్షణంలోనే.

మధుమూర్తిని చూసీ చూడనట్లు నటించాడు అది గమనించి అతడు మనస్సులో నవ్వుకున్నాడు.

హాల్లోకి వెళ్ళగానే అందరికీ 'డ్రింక్స్' తెప్పించాడా డాక్టరు. అవసరం లేకపోయినా వాళ్ళందర్నీ మాట్లాడించుతూ— 'నో', అన్పించుకుంటూ, అటూ యిటూ పదిసార్లు తిరిగాడు కాలరు సర్దుకుంటూ, ట్రాపులో చేయి దూర్చుకుంటూ, విలాసంగా సిగరెట్ పీలుస్తూ.

ఓ సిసింద్రీ పేలనే పేలింది అంతలో.

'పొగ త్రాగినవారు శిక్షింపబడుదురు!' అని.

'కఠినంగా!' అంటూ పూర్తిచేసిందో అగ్గిపుల్ల.

'సారీ!' అంటూ వెంటనే సిగరెట్‌ను పారవేశాడా యువకుడు.

'నో లారీ టుకేరీ యువర్ సారీస్!' అంటూ నవ్వారందరూ!

'మంచి హాస్యంగానే మాట్లాడతారే ఆంధ్రాగరల్స్' అన్నాడతడు

'ఆట మొదలైనది!' అన్నదో కంఠం

వరుసగా అందుకున్నారు తర్వాత— బుర్రకథలోని వంతగాళ్ళలా.

'మాట్లాడిన పోట్లాట తప్పదు!'

'తప్పినా సీటు దొరకదు!

'సారీ! అన్నా లాభం వుండదు?'

'గేటుకీపర్రా చోటు వుండదు!'

బాణాలు సూటిగా విసరబడుతున్నాయి. ఆ నాగరిక యువకుడు పెదవి కదుపనే లేదాపైన. గభాలున సీటులో కూర్చుండిపోయాడు 'గట్టిగా వూపిరిపీల్చినా నేరమే' అనేట్లున్నారు అందుకే పాపం! ఆ డాక్టరు బొమ్మలా కూర్చుండిపోయాడు.

సినిమా పూర్తయి యిళ్ళకు బయలుదేరేప్పుడు అనుకున్నారు లో గొంతుకలతో వాళ్ళలో వాళ్ళు.

'ఇషో కేసులో బొమ్మలా వుండిపోయాడు! పాపం!'

'అనూ! కారుంది! డ్రాప్ చేస్తాను! రా!' అన్నాడు విజయ్ ఆ బృందమంతా వెళ్ళిపోగానే

అనుపమ నోరు విప్పక తప్పలేదు—

'మాష్టారున్నారు! నాన్నగారికి ఫోను చేశారట! కారు పంపించమని'

'ఆల్‌రైట్! గుడ్‌నైట్! గుమాస్తా

గారూ!' అంటూ బర్రున స్టార్టుచేశాడు కారును.

'ఎంత నాటకమో చూడండి! మీరిపుడే కల్పించినట్లు 'విష్,' చేస్తున్నాడు' అన్నది కసిగా అనుపమ.

'పోనీలే అనూ! ఎవరిపిచ్చి వాళ్ల కానందం!' అన్నాడు మధుమూర్తి సౌమ్య స్వరంతో.

అంతలో కారు వచ్చింది. ఎక్కికూర్చున్నారిద్దరూ.

'వూరికెందుకు? వెళుతున్నానన్నారు?' అన్నదామె

'శారదక్కయ్య వచ్చిందట! అదే గాదనుకో! మాధవి మరీ విసిగించుతోందట అమ్మను! ఓసారి వెళ్లివస్తే బావుంటుందని.'

మాధవి స్మృతులతో అతని మనస్సు ఆవేదన చెందుతుందని గ్రహించిన అనుపమ ఆపైన ఆప్రసక్తి రానీయకుండా జాగ్రత్త వహించింది.

* * *

మధుమూర్తి 'పాలెం' చేరుకునేసరికి అంధకారం అలముకుంది అమావాస్యకావడం మూలాన.

అప్పటికి మాధవి మేల్కొనే వుంది! ఆమె స్వరం వినగానే అతడు భారంగా నిట్టూరుస్తూ లోన అడుగువెట్టాడు.

'బావ! వచ్చేశాడే! అత్తయ్యా! చప్పున రా!' అంటూ మధుమూర్తిని చూడగానే పెద్దగా కేకలు పెట్టింది.

'మరే! మనింటికి ఓ చుట్టాలమ్మాయి వచ్చింది! ఎప్పుడూ ఏడుస్తూనే వుంటుంది పాపం! ఎందుకనో!' అంటూ మొదలెట్టింది.

'మాధవీ! ఇలా రామ్మా! మీ బాబు ఏడుస్తున్నాడు!' అన్న పిలుపు వినగానే మధుమూర్తిని వదిలేసి పరుగున వెళ్లిపోయింది.

ఓ పెద్ద రబ్బరు బొమ్మ వుందా యింట్లో! పిచ్చి పట్టినప్పటినుంచీ ఆ బొమ్మ ఆమెకు కడుపారా కన్నబిడ్డ!

ఊయలలోవుంచి వూపుతుంది ఆ బొమ్మనే!

జోలలుపాడి నిదుర బుచ్చుతుంది! హుష్! మాట్లాడవద్దు. ఎవ్వరూ యిక! నిద్దరోతున్నాడు!' అంటూ అందర్నీ హెచ్చరించుతుంది చీకటి అలుముకోనే.

'బాబు ఏడుస్తున్నాడూ!' అన్న మాట చాలు ఆమెకు ఎంతపిచ్చిగా ప్రవర్తించుతున్నా సరే వెంటనే లేచి వెళ్లిపోతుంది. ఆ బొమ్మను ఒడిలో వుంచుకుని అంటుంది—

'నా బాబే! బంగారుకొండే! ఎందుకు నాన్నా! ఏడుస్తున్నావ్? నాన్నారికోసమా! వస్తారుగా! మరి అమ్మమాట వినవూ?' అని ఆ మాటలు వింటూన్న మధుమూర్తి మనస్సు వేదనతో విల విల లాడిపోసాగింది.

'నాన్న!— బాబు!' అంత తీయని అనుబంధానికి మనం నోచుకోలేదు! మాధవీ!' అతని హృదయాన ఆవేదన అలలై విరుచుకు పడుతోంది.

తల్లిని చూడగానే పలుకరించాడు శుష్కహాసంతో.

'శారద యిపుడే పడుకుంది బాబూ! ఫిట్స్ వస్తున్నాయి దానికి!' ఆమె కంఠాన దిగులు గూడు కట్టుకుంది.

'మరి డాక్టరేమన్నాడమ్మా!' అన్నాడు మధుమూర్తి ఆతురతతో.

'ఏమంటారు? మందులు వాడండి! తగ్గిపోతుందంటారు డాక్టర్లు! అదేమో నానాటికీ కృశించి పోతోంది మనోవ్యాధితో' అన్నదామె.

అతడు భారంగా నిట్టూర్చి గోడకు చేరగిలబడి కళ్లు మూసుకున్నాడు. ఆ రాత్రి ఆ తల్లీ కొడుకుల హృదయాల్లో అశాంతి స్వైర విహారం చేసింది. ఉదయాన లేవగానే శారదకు 'ఫిట్' వచ్చి పడిపోయింది.

మధుమూర్తి ఆమె బాధను చూడలేకపోయాడు. కాళ్లూ చేతులూ తన్నుకుంటోంది. నోటివెంట నురుగు వస్తోంది.

తల్లి చెప్పినదంతా జ్ఞప్తికి వచ్చింది. బావగారెమైపోయినదీ ఎవరికీ అంతు చిక్కడం లేదు. మంజులా, కృష్ణలు పసిగందులు. వాళ్లను చూసుకునే బ్రతుకుతోందామె.

'శారద జీవితం ఓ పెద్ద అగ్నిగుండం' అని మధుమూర్తికి తెలుసు. కానీ ఏ విధంగా అంత వ్యధను దూరంచేయాలో మార్గమే తోచకుండా పోయిందతనికి. ఉదయాన్నే అక్కమొహం చూసిన అతని హృదయం ద్రవించిపోయింది. ఎర్ర వారిన ఆ బాధామయ నేత్రాలలో శోకం గూడు కట్టుకున్నట్లు తోసిపోతోంది చూడగానే.

ఆమె ఆకృతి చూడగానే నివ్వెరపోయాడతడు.

(ఇంకా ఉంది)



'ప్రశ్నావళి' శీర్షికకి ప్రశ్నలను పంపేవారు కవరుమీద స్పష్టంగా 'ప్రశ్నావళి,' ఆంధ్ర సచిత్ర వార పత్రిక, మద్రాసు — 1.' అని వ్రాయకోరుతున్నాము.— సం॥







# వారఫలం

## 6-6-1969 శుక్రవారం మొదలు 12-6-1969 గురువారం వరకు

**మేషం:** వ్యాపారంలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. వారం ఆఖరులో తిరిగి అనుకూల పరిస్థితులు యేర్పడుతాయి.

స్త్రీలకు — నూతన విషయాలను తెల్సుకొంటారు. అధిక వ్యయం జరుగుతుంది.

**వృషభం:** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించగలవు. విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం ఆఖరులో ఆకస్మికంగా చికాకులకు గురికాగలరు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**మిథునం:** అన్ని వ్యవహారాల్లోను అనుకూలమైన మార్పులు వస్తాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. నూతన వ్యవహారాలు లాభించగలవు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు— సంతోషకరమైన వార్తలను వింటారు. దైవకార్యాలు నెరవేరుతాయి.

**కర్కాటకం:** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం వచ్చే పరిస్థితి యేర్పడుతుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం మధ్యలో అనుకూల పరిస్థితులు యేర్పడతాయి. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. స్థిరాస్థి వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు— అధిక వ్యయం జరుగుతుంది. సాటివారిలో గౌరవం లభిస్తుంది.

**సింహం** వ్యాపారంలో ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం మధ్యలో అన్నివ్యవహారాల్లోను చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. అనుకూల వార్తలను వింటారు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య:** ఇతరులమీద ఆధారపడి యే వ్యవహారమూ ప్రారంభించడం తగదు. వృత్తిలో శ్రమమీద అనుకూలత లభిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. వారం ఆఖరులో ఆకస్మికంగా శ్రమకు గురికాగలరు. సాహసముతోకూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**తుల:** వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసముతోకూడిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. సాటివారితో మాట పట్టింపులు తగవు. ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాంఘిక కార్యక్రమాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**వృశ్చికం:** ఇతరుల నిమిత్తం మీరు శ్రమ పొందవలసి వస్తుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీకృషి ప్రోత్సాహకరంగా ఉంటుంది. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది బంధువులకు సహాయం చేస్తారు.

**ధనుస్సు** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగా ఉంటాయి. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. నూతన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. పుణ్యకార్యాలు చేస్తారు.

**మకరం** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు అనుకొన్నట్లుగా నెరవేరతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది సంతోషకరమైన వార్తలను వింటారు.

**కుంభం:** మీ ఆత్మవిశ్వాసమే అన్ని వ్యవహారాల్లోను అభివృద్ధిని సాధించగలదు. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. మిత్రులకు సహాయం చేయగలరు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. విలాసవస్తువులు కొంటారు.

**మీనం:** కొన్ని వ్యవహారాల్లో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. వ్యాపారంలో శ్రమ కలుగుతుంది. వారంమధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది.

స్త్రీలకు — దైవకార్యాలు నెరవేరుతాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

—మహేష్

# తలుపు

సి. మధు



ఆ తలుపుకి చీకటంటే చాలా భయంగా వుంటోంది. చీకట్లో దానికి భయమేసే సంఘటనలు చాలా జరిగేయి భయంగా వింతగా, ఏవో తెలియని అడవుల్లో ఎవరో కనబడని ఆశ్వికులు గుర్రాలమీద అస్పష్టంగా పోతున్నట్లు ఆ సంఘటన లన్నీ మసక చీకటిలో దాని కళ్ళముందు మళ్ళీ జరుగుతున్నట్లే వుంటాయి చీకటి పడినప్పుడల్లా దానికి దిగులుగా ఎవరో వెక్కివెక్కి ఏడుస్తున్నట్లు వినిపిస్తుంది. మూగ ప్రేమికుడెవరో, గాలికీ, ఆకాశానికీ తన ప్రేమని అర్థంకాని భాషలో అరుస్తూ చెప్తున్నట్లు అనిపిస్తుంది తరుణ వయసులో మరణవేదన పడే నిర్భాగ్యుడి రూపు భయంకరంగా ప్రత్యక్షమవుతుంది.

ఆ తలుపు చాలా పాతది విశాల ప్రపంచానికీ నాలుగుగోడల్లోని దుమ్ము పట్టిన ఇరుకుగదికీ మధ్యన ముసలినేదంతి లాగ మాటలు రాని ప్రేక్షకుడిలాగా అడ్డంగా నిలబడి వుంటుంది దాని వెనకగా గోడలో దొలిచిన చిన్న గుహలా వుంటుంది ఆ గది. ఒకే ఒక కిటికీ తప్ప దాంట్లోకి గాలీ వెలుతురూ వచ్చే మార్గమే లేదు ఆ గదిలో చాలామంది వుండి వెళ్ళిపోయేరు చాలామంది చాలా బాధలు అనుభవించేరు. కష్టాల్లో కన్నీళ్ళు పెట్టుకున్నారు సుఖాల్లో గది కప్పెగిరి పోయేలా పడుకొని సంతోషంగా నవ్వుకొన్నారు తరువాత సత్రంలో బాటసారులలాగానే ఖాళీ గది మిగిల్చి వెళ్ళిపోయేరు.

అటూ ఇటూ గంభీరంగా నిలబడి వున్న రెండు పెద్దింటిగోడలు ఆ సన్నటి సందుని సృష్టించేయి. ఆ సందులో సాధారణంగా జనసంచారం వుండదు. పైగా రెండు తలుపులుండాల్సిన ఆ గది ద్వారానికి ఒకేఒక్క పెద్ద చెక్కతలుపు వుంది... అందుకని అది ఆ సందులో ఒంటరితనం అనుభవిస్తోంది. రోజులు గడిచి సంవత్సరాలయినందుకు చిహ్నంగా దానిమీద బీట్లులు పడిపోయేయి. నల్లగా మాసికలు పడ్డాయి. ఇంకా నల్లగా తుప్పపట్టిన మేకులు బయటికి కనిపిస్తున్నాయి. ఆ గదిలో నివసించినవాళ్ళు ఎప్పుడో ఎన్నాళ్ళకిందటో అలంకరణార్థం ఆ తలుపుని బాగా ఉపయోగించుకున్నారు. పాతకాలపు చక్రవర్తుల అర్థంకాని శాసనాల్లాగా వాళ్ళు ఆ తలుపులమీద అతికించుకున్న కాగితాలు అలాగే నిలిచిపోయాయి. మధ్యగా ఓ ప్రింటెడ్ పేపరుమీద ఆ వూళ్ళో గయోపాఖ్యానం నాటకం వేసే తేదీ, నటుల పేర్లు రాసి వున్నాయి. కిరీటం పెట్టుకున్న మనుషుల బొమ్మలు రెండు ఆ కాగితంలోంచి తొంగి చూస్తున్నాయి. దానిపక్కని ఏవో వార పత్రిక లోంచి చించిన బొమ్మ వుంది. ఏదో సినిమాలో దృశ్యం అది. ఆ బొమ్మలో ఇద్దరు వ్యక్తులు ఆప్తమిత్రుల్లా నిలబడి వున్నారు. వాళ్ళిద్దరి కళ్ళల్లో స్నేహం మెరిసిపోతూంది...

దాని జీవితం సగం చీకట్లో సగం వెలుతురులో గడిచిపోయినా ఆ తలుపు నిర్లిప్తంగా వుండిపోతుంది. కాని హఠాత్తుగా దానికి చివరిరోజుల్లో చీకటంటే భయం పట్టుకుంది. ఖాళీగది, బూజుపట్టి భయంకరంగా చూసే గోడలూ, ...

గని ముకికిసంతా చీకటి పడగానే దానికి వందలకొద్దీ జ్ఞాపకాలూ తెస్తున్నాయి. జ్ఞాపకాలు వికృతంగా నృత్యం చేస్తుంటే, తలుపు గలికి దడదడా కొట్టుకుంటోంది.

నిర్లిప్తంగా వుండే ఈ నాలుగు గోడల మధ్య చాలా చీకటిరాత్రుల వెనక ఇద్దరబ్బాయిలు బ్రతికేరు వాళ్ళకి ఆ సందూ, గదీ వేరే ప్రపంచంలా వుండేది. గోడలూ తలుపూ నిరాశావాదుల్లా చూస్తుంటే వాళ్ళిద్దరూ పకపకా నవ్వుకున్నారు కలిసి కలలు కన్నారు ఆశావాదుల్లా జీవించారు. వాళ్ళిద్దరిలో ఓ అబ్బాయికి గిరజాల జుట్టుండేది. పెద్ద ముక్కూ అందమైన కళ్ళూ వుండేవి. తను పనిచేసే ఫౌండ్రీలో కరగి గట్టిపడిన పుక్కులాంటి కండలుండేవి అతనికి సినిమాలంటే ప్రాణంగా వుండేది. 'నాగేస్రావు'ంటే మరీ ప్రాణంగా వుండేది. ఇంకో అతను పక్కపాపిడితీసి దువ్వేవాడు. అతని కళ్ళు ఎర్రగా జ్యోతుల్లా వుండేవి. ఏదో సినిమాహాల్లో గేట్‌కీపర్‌గా పని చేసేవాడు. అయినా అతని జీవితంలో నాటకంవేషాలు వెయ్యడంకంటె వున్నతమైన ఆశయం ఏమీ వుండేదికాదు. అతను సన్నగా పొడుగ్గా బలవంతుడు నాశనంచేసే బలహీనుడులా దిగులుగా వుండేవాడు.

వాళ్ళిద్దరూ స్నేహితులు. గదిమధ్యని చింకి చాప మీద కూర్చొని బిగ్గరగా

# తలుపు

కబుర్లు చెప్పుకున్నారు. పక్క పక్కనే పడుకుని ఇంకా బిగ్గరగా అర్థం లేకుండా నవ్వుకుంటూ గడిపేరు. సమాధానం తెలియని ప్రశ్నలకి వాళ్ళు బాధపడలేదు. వాళ్ళు జీవితాన్ని ఆ చిన్న గదిలోంచే చూశారు. అంత చిన్నదిగా కనబడింది వాళ్ళకి.

ఒకరోజు గిరజాల జుట్టబ్బాయి ఓ వార పత్రిక కొనుక్కొచ్చేడు. శ్రద్ధంగా దాంట్లోంచి ఓ బొమ్మ కత్తిరించి తీసి ఆ తలుపుమీద అంటించేడు—భాగ్యవంతుడి ఖరీదయిన గదిలో అర్థంకాని అందమైన రంగులబొమ్మ అలంకరించినట్లు. నాలుగు మూలలా కొంచెం కొంచెం బూజు పట్టిన ఆ తలుపుమీద ఆ బొమ్మ గట్టిగా అతుక్కుపోయింది విడదీయలేని మిత్రుడిలాగా.

అప్పుడు గిరజాల జుట్టబ్బాయి స్నేహితుడి భుజంమీద చేయేసి దగ్గరకు తీసుకుని 'ఒరే రాజా మనిద్దరం ప్రాణమిత్రులంరా!' అన్నాడు సాధ్యమైనంత గంభీరంగా.

'అచ్చు రాత్రి సినిమాలో జగ్గయ్యన్నట్టే అన్నావురా' అని ఆశ్చర్యపోయేడు రాజా. బహుశా ఆ రోజునుంచీ వాళ్ళిద్దరూ ప్రాణమిత్రులయ్యారు. వాళ్ల డ్యూటీలు కలవకపోయినా ఆదివారాలప్పుడూ శలవలప్పుడూ వాళ్ళిద్దరూ కలిసి వూరంతా తిరిగేవాళ్ళు. ఇద్దరూ కలిసి డ్రామాల కెళ్ళేరు. సినిమాలు చూశారు. అద్దె సైకిళ్ళమీద వెళ్ళి సరదాగా సముద్ర స్నానం చేశారు. బ్రతుకంతా సముద్రం నీటిమీద ప్రతిఫలించే లేత ఎండలాంటిదే ననుకున్నారు.

ఇది జ్ఞాపకంవస్తే ఆతలుపుకి కొత్త జీవితం వచ్చినట్లు వుంటుంది. లోపల ఎవరో మాట్లాడకుంటున్న చప్పుడూ నివసిస్తున్నారనే అనుభూతీ ఎంతో హాయి నిచ్చేదానికి ఆ అనుభూతిని దూరం చేసిన దృశ్యాలు అది మరచిపోలేకపోతోంది. కాటికి కాళ్ళు జాచుకున్న వృద్ధుడికి హఠాత్తుగా పిచ్చెక్కినట్లు జ్ఞాపకాల విషవలయంలో చిక్కుకుపోయిన తలుపు కంగారు పడిపోతూంది.

ఓ అందమైన సాయంకాలం డ్యూటీ నుంచి తిరిగివచ్చిన గిరిజాల జుట్టబ్బాయీ, డ్యూటీ కెళ్ళబోయే రాజా మాట్లాడుకుంటున్నారు. గిరిజాల అబ్బాయి పేరు ప్రసాదు...వీధి పంపుదగ్గర స్నానం చేసివచ్చి బట్టలు వేసుకుంటూన్న ప్రసాదు పేంటు జేబులోంచి ఓ ఫోటో తీసేడు. రాజా అది చూసి అర్థం కానట్లు మొహంపెడితే, సినిమా హీరోలాగా, ఓచేయి గుండెమీద పెట్టుకుని నెమ్మదిగా, 'నీ కిన్నాళ్ళూ చెప్పనందుకు క్షమించు, రాజా. ఈ అమ్మాయీ నేనూ ప్రేమించుకున్నాం. నా హృదయ దేవత అయిపోయింది ఈ అమ్మాయి...' అన్నాడు.

మొదట రాజా కంగారు పడ్డాడు 'అసలీ అమ్మాయి ఎవరు?' అని అడిగేడు. ఎవరో తెలుసుకున్నాక భయపడ్డాడు.

'నిజమా, వేళాకోళమా...అసలు నీకెలా పరిచయమయింది?'

రాత్రిపూట ఒంటరిగా నడచిపోయే బాటసారి దారికడ్డంగా చీకట్లో వల్లటి ఆకారం హఠాత్తుగా మాట్లాడకుండా నిల్చుంటే, ఆమనిషి భయంగా మనిషేనేమో అనే ఆశతో 'ఎవరు ...ఎవరు నువ్వు?' అని అడిగినట్లుగా ప్రశ్నలు కురిపించేడు.

ప్రసాదు నేరస్థుడిలా తలవంచుకున్నాడు అతను చేసిన తప్పులు చాలా



వున్నాయి ఇప్పుడు. రాజాకి కోపం వచ్చింది. 'ఛ నాకు తెలియకుండా ఎలాంటి పని చేశావు...' అని విసుక్కున్నాడు కష్టాల సుడిగుండాల్లో బతకటానికి దారిలేక తిరిగి కూడు గుడ్డకోసం తనువమ్ముకునేస్థితికి వచ్చినదీనురాలిని ప్రసాదు ప్రేమిస్తున్నాడు! అమర ప్రేమికుడులా త్యాగమూర్తిలా వుద్ధరిస్తానంటున్నాడు అసలు అలాంటి చోట్లకి ఎందుకు వెళ్ళాలి. వెళ్ళిననాడు అమ్మకం సరుకుమీద అంతులేని ప్రేమ ఎందుకు చూపించాలి.

రాజాకి కంపెనీలగురించి వాటి ఆర్గనైజేషను గురించి తెలుసు. ఆ అమ్మాయి తెలియకపోయినా ఆ అమ్మాయి పరిస్థితుల గురించి తెలుసు. ఆ పిల్ల పద్మవ్యూహంతో ఆమె చుట్టూవున్న బురద—బురదలో చిందరవందరగా పడున్న ముళ్ళూ దాక్కున్న విషసర్పాల గురించికూడా కొంచెం తెలుసు. అందుకని ఆ పద్మవ్యూహాలగురించీ వాటి వెనకవున్న పెద్ద చేతులగురించీ, పెద్ద చేతుల్లోని దుష్టశక్తులగురించీ భయంగా వర్ణించి చెప్పేడు ప్రసాదుకి — చిన్న పిల్లాడికి రాక్షసులగురించి చెప్పినట్టు.

ప్రసాదు కప్పుడు ప్రేమించానని భయం వేసింది. 'ఆ అమ్మాయి పాపం నాతో వచ్చేస్తానంది రమ్మంటే నాకోసంఏదైనా చేస్తానంది. అక్కడ ఆమె చాలా బాధపడిపోతోంది. ఆ బాధ చూడలేను రాజా. ఈ జాలీ భరించలేను. ఏదో ఒకటి చేసేయాలి...' అని గొణుగుతూ మాటాడేడు. ప్రేమించడం, ప్రేమించిన ప్రియురాలు తనతో వచ్చేస్తాననడం తల్చుకుంటే అతనికి వళ్ళు పులకించింది. దానివెనక నీడల్లాంటి సమస్యలు కనబడితే వళ్ళు జలదరించింది.

'నన్నొదిలి వెళ్ళిపోవడానికి ప్లానుకూడా వేసి రడీగా వున్నావన్నమాట' అన్నాడు రాజా బాధగా. సాయంత్రపు చీకట్లు ముసురుతూంటే వాళ్ళిద్దరూ నిశ్శబ్దంగా ఆలోచించేరు. ఆ క్షణంలో వాళ్ళకి జీవితమంతా పెద్ద సమస్యలా కనబడింది.

కాసేపయింతర్వాత హఠాత్తుగా ఏదో ఆవేశం వచ్చినట్టు రాజా గబగబా మళ్ళీ ఏదో చెప్పబోయేడు. 'డేంజ'రన్నాడు. 'నామాట విను' అన్నాడు. నిస్సహాయుడిలాగా విసుక్కున్నాడు.

# తలుపు

అతనిమాటలు వింటూంటే ప్రసాదుకి తనొక్కడే ఏదో పాతపడవలో దూరంగా వెళ్ళిపోతున్నట్టూ, నదిగట్టున నిల్చొని ఆ అమ్మాయి ఏడుస్తూ పిల్చినట్టూ అనిపించింది. రహస్యంగా చీకట్లో ఆ అమ్మాయి నీతో వచ్చేస్తాను అని చెప్పిన మాటలు జ్ఞాపకం వచ్చాయి. పాలరాతిమీద గంటుల్లాగా తెల్లటి మొహంమీద కనబడీ కనబడని మచ్చలూ, జాలిగా చూచిన కళ్ళూ సన్నటి మెత్తటి చేతులూ కూడా గుర్తుకొచ్చేయి.

అందుకని ప్రసాదు గుండెనిబ్బరం తెచ్చుకొని ప్రాణమిత్రుడి మాటలు లెక్క చేయకుండా చెప్పేడు. 'ఏమైనా సరే నేను ఆ అమ్మాయితో వెళ్ళిపోతాను. ఇన్ని ఆశలు పెట్టి మోసం చేయలేను. జాడ దొరక్కపోతే 'పోతే పోయిందిలే' అని వాళ్ళే వూరుకొంటారు. తరవాత ఎక్కడైనా రిక్షాలాగైనా బతకొచ్చు...'

రాజా మాట్లాడలేదు. 'సరే...నన్నొదిలి దూరంగా వెళ్ళిపోతావన్నమాట ...వెళ్ళిపో' అనుకున్నాడు. ఆ తలుపూ గోడలూ వాళ్ళిద్దరివంక రివాజు ప్రకారం ముభావంగా చూసేయి.

* * *

తరువాత దృశ్యం ఆ తలుపు జ్ఞాపకం చేసుకున్నప్పుడు అమాయకుడు గడచిపోయిన పీడకలని తల్చుకుంటున్నట్టుగా ఆలోచిస్తుంది. ఆ రోజు ఆదివారం. రెండో ఆట సినిమాకెళ్ళి తిరిగివస్తున్న స్నేహితులిద్దరూ వాళ్ళ ప్రపంచపు సరిహద్దు అయిన సందు మొగలోకి అడుగుపెట్టేరు.

అడుగుపెట్టటం తర్వాత వాళ్ళ గుండెలు ఓ క్షణం ఆగి మళ్ళీ కొట్టుకోవాల్సిన అవసరం వచ్చింది. వీధి దీపం గుడ్డివెలుతురులో నాలుగు బలిష్టమైన నీడలు కనబడ్డాయి. అవి వీళ్ళని చూడగానే కదిలేయి. పొట్టినిక్కరు మనుషులు యమకింకరుల్లా కనిపించేరు వాళ్ళ చేతుల్లో ఇనుప చువ్వలు మృత్యువు రూపాల్లా మెరిసేయి. వాళ్ళనుంచి వచ్చే మత్తెక్కించే ముతకవాసన చిరకాలంనుంచి ఆ సందులోవున్న మురికి కాలవ కంపుతో మిళితమై వాళ్ళని చుట్టేసింది.

తరవాత పక్కనున్న చెట్టుమీద ఏగుడ్లగూబా అరవలేదు ఘోరం జరగబోతోందని నక్కలు కూయలేదు. చీకటి చీకటిలా వుండిపోయింది తాళం వేసిన తలుపు సాక్షిలా చూస్తోంది. వీధి దీపం బల్బు కర్తవ్యం నిర్వహిస్తూ వెలుగుతోంది. దీపం స్థంభానికి ఆనుకున్న గిరజాలజుట్టు ఆకారం విరామం లేకుండా అంతరిక్షంలోంచి వచ్చే దెబ్బల్ని రుచి చూస్తోంది. ఇనపకడ్డీలు విలయ విహారం చేస్తున్నాయి కరగగిగట్టి పడిన వుక్కుకండలు మళ్ళీ కరిగి పోతున్నాయి. కరిగిపోయి భయంకరంగా ఎర్రగా వాస్తున్నాయి. రాజా శరీరం మరోపక్క కుప్పగా కూలిపోయింది. కూలిపోయిన వీపులోంచి నల్లటి నెత్తురు అమాయకంగా కారిపోతోంది. భౌతిక శరీరాల మూలుగులు దెబ్బల శబ్దాల్లో కలిసిపోయేయి.

ఆ క్షణాల్లో వాళ్ళిద్దరికీ హఠాత్తుగా వెయ్యి ఏనుగులు వాళ్ళని ముక్కలు ముక్కలుగా చేసి తొక్కుతోన్నట్టు, శరీరం మిషను చక్రాల్లో పడి నలిగిపోతున్నట్టూ అప్పుడు పిశాచాలు తమని చూసి పరిహసిస్తున్నట్టూ అనిపించింది. చెవులనిండా మోతలు నవ్వులు అరుపులు వినిపించేయి. కళ్ళలో రంగులూ, చీకట్లూ మెరుపులూ గిరగిరా తిరిగేయి. వంటినిండా నెప్పులూ, ఎముకలు విరిగే చప్పుడూ అలసిపోయిన గుండె ఆగిపోవడం తెలిసింది.

అప్పుడు ఒక్కసారి అంతా నిశ్శబ్దం అయిపోయింది. చెవులలో చప్పుళ్ళు వినబడటం ఆగిపోయింది. ఎముకలు విరగటం మానేశాయి. వీధిదీపం వెలుగుతూనే వుంది. నక్షత్రాలు నాలుగైదు జాలిగా మెరుస్తున్నాయి. మురికినీళ్ళలో మునిగి పడున్న రాజా పైకి లేచేడు. లేచి నిల్చోలేక తూలి పడబోయాడు. తూట్లుపడిన శరీరంలో మిగిలిన ఏ శక్తో అతన్ని నడిపించింది. ఆ శక్తితోనే ప్రాణమిత్రుణ్ణికూడా గదిలోకి చేరేశాడు. సగం తెరుచుకున్న తలుపు తెల్లబోయి చూస్తుండగానే చింకిచాపమీద పడి బాధల స్పృహ కోల్పోయేడు.

అప్పట్నుంచి అంతా గందరగోళం... బూట్ల చప్పుళ్ళూ కేకలూ... గోల! రాజాకి ఎవరో మందు రాస్తున్నట్లనిపించింది. ఎవరో ఏదో అడుగుతున్నారు. అంతా మసక మసకగా వుంది. రాజాకి

భయం వేసింది. కాని అతనికళ్ళకి ఎర్ర టోపీలూ మూడుతలల సింహమూ కనిపించేయి బలహీనంగా 'పోలీసోళ్ళు!' అనుకున్నాడు. అతన్ని గవర్నమెంటు డాక్టరు పరీక్షించి చూసేడు. ప్రెసాదుని ఆయనే చూసి హత్య అని చెప్తున్నారు. రాజా మళ్ళీ 'హత్య ... హత్య' అనుకున్నాడు 'ఆళ్ళు ప్రెసాదుగాణ్ణి చంపేశారు...'

అతనికి ఆలోచించే శక్తీ బతుకుతున్నాననే అనుభూతీ గాలి చల్లదనం ఎండ వేడిమీ తెలియటానికి పదిరోజులు పట్టింది. ఆ రోజులన్నీ తెల్లగోడలూ తెల్లబట్టల నర్సులనీ చూస్తూ గడిపేడు. ఇన్స్పెక్టరు ఓసారివచ్చి నయమైనాక కోర్టుకు రావాలని చెప్పేడు. 'కోర్టు...జన్మలో కోర్టు చూడలేదు'. అనుకున్నాడు. తరువాత ప్రెసాదు జ్ఞాపకం వస్తూండేవాడు. 'చెప్తే వినకుండా ఇంతకి తెచ్చేడు. అసలు ఈ గొడవ ఆళ్ళందరికీ ఎలా తెలిసిపోయిందో' అనుకునేవాడు చాలాసార్లు.

దెబ్బలు నయమయినాక హాస్పటల్‌నుంచి ఇంక వెళ్ళవచ్చు, అని చెప్పేరు కుంటు కుంటూ గదికి బయలుదేరేడు. కొన్ని యుగాలైంది ఆ గదిచూసి. సినిమాహాలూ వుద్యోగం—బట్టతల మేనేజరూ జ్ఞాపకం వచ్చేరు పదిరోజులూ పనిలోకి వెళ్ళలేదు ఒకవేళ ఈ గొడవ చూసి పనిలోంచి తీసేస్తే...రిక్షాకూడా లాగలేడతను. ఇంక ఏం చేయాల్సి వుంటుందో—అనిపించింది. గదిదగ్గర ఆగి తలుపు తీసేడు. ఎదురుగుండా చిరిగిపోయిన చాప కన్పించింది. ఆదే చాపమీద ఆరోజు రాత్రంతా ప్రెసాదుగాడి శవం వుబ్బిపోయి పడివుండి వుంటుంది. అతనికి వొళ్ళు జలదరించింది ఆలోచిస్తూ నిల్చుండిపోయేడు. వెనక చిన్నశబ్దం ఏదో అయింది. వులిక్కిపడి వెనక్కి తిరిగి చూసేడు.

ఐదుగురు మనుషులు. ముగ్గురుమాత్రం ఖాకి నిక్కర్లు వేసుకుని రౌడీల్లా వున్నారు. వాళ్ళకి నాయకుడులా వున్నాయన అచ్చం తెలుగు సినిమాలో విలనులానే వున్నాడు. ముందుకి రెండడుగులు వేసి 'రాజారావ్' అంటున్నాడు. ఆయనముఖం ఎర్రగా వుంది. కళ్ళు క్రూరంగా ధైర్యంగా చూస్తున్నాయి. ఆయన కట్టుకున్నది మల్లెపూవులాంటి తెల్లటిపంచె వేసుకున్నది గ్లాస్కో లాల్చీ. ఆయన మెడలో బంగారు గొలుసుంది. ఆయన శరీరం లావెక్కి వుంది. జుట్టు నెరిసుంది. గొంతు బొంగురుగా అజ్ఞాపిస్తున్నట్లుంది ఆయన వెనక నల్లటి లావుగా వున్న ఇంకోమనిషి చిరునవ్వు ముఖంతో కారాకిళ్ళీ నములుతూ చూస్తున్నాడు.

రాజా భయంగా 'ఎవరు కావాలిబాబూ' అని అడిగేడు. ఖాకీనిక్కరు మనుషుల్ని చూస్తుంటే చెవుల్లో గింగుర్లెత్తే శబ్దాలూ, వంటినొప్పలూ జ్ఞాపకం వస్తున్నాయి అతనికి. విలను లాంటాయన చాపమీద కూర్చున్నాడు. కారాకిళ్ళీ మనిషి పక్కనే ఆసీనుడయ్యాడు. విలను ఈ విధంగా చెప్పేడు—

'రాజారావూ నువ్వు మంచోడివి, అందుకని బతికి బయటపడ్డావు. అయ్యాళ ఎదవ సన్నాసులు మరీ వితక్కొట్టేశారు. ఆడేమో చచ్చాడు. అది కాస్తా ఈళ్ళ ప్రాణంమీద కొచ్చిపడింది. ఇద్దరు దొరికేపోయారప్పుడే. ఇక ఈళ్ళగోల. ఈళ్ళని రచ్చించాల్సింది నేను, నన్ను రచ్చించాల్సింది నువ్వు' పెద్ద జోకు వేసినట్లు నవ్వేడు

'నాకేం తెలీటంలేదు బాబూ' అన్నాడు రాజా అయోమయంగా.

'ఏంలేదు. ఇందులో అర్థం కానిదేంటి, పోలీసోళ్ళు నక్కల్లాగా కాచుక్కూర్చున్నారు నీకోసం, ఎప్పుడు ఆస్పటలు నుంచొస్తావా అని. కేసంతా నీమీదే వుంది. నువ్వు పిచ్చమాటలు మాటాడకుండా ఒప్పుకుంటే నిన్ని ప్లీడరుగారి కప్పగిస్తాను. ఇహ ఆయనే ఇత్తాడు ఆ ట్రైనింగూ—అదీ. ఆయన చెప్పిందల్లా ఇను. ఆయన చెప్పినట్టే జెప్పాల కోర్టులో. మమ్మల్ని ఆపదలో ఆదుకున్నావా, రాజారావూ, నీ కష్టం మేముంచుకోం.' అని పక్క జేబులోంచి ఓ నోట్లకట్టతీసి రాజాముందు పడేశాడు. తేలిగ్గా పనయిపోయినట్లు పెద్ద లంకపొగాకు చుట్టతీసి వెలిగించి అతని కేసి చూసేడు.

రాజా 'ప్లీడరుబాబు' కేసితిరిగి 'నేనేం చేయాలో తెలవటంలేదు బాబుగారూ' అన్నాడు. ప్లీడరు బాబుగారు విచిత్రంగా నవ్వి చెప్పేడు. 'అంతా నీకే తెలుస్తుంది. నువ్వు వూఁ అంటే చాలు నీకిక రాజభోగమే — నువ్వు చేయాల్సిందాంట్లో కష్టం కూడా లేదు మిమ్మల్నెలా కొట్టేరో ఎక్కడ కొట్టేరో అన్నీ అడుగుతారు కోర్టులో. అన్నీ చెప్పేయచ్చు వున్నదున్నట్టుగా. కాని ముఖ్యమైన పాయింటొకటే వుంది. కొట్టినవాళ్ళని గుర్తుపట్టగలవా అంటారు. అవునంటావు. ఇద్దరిని చూపిస్తారు నీకు. ఆ వాళ రాత్రి మిమ్మల్ని కొట్టినవాళ్ళు వాళ్ళిద్దరూ కాదనీ, అసలోళ్ళకీ వీళ్ళకీ తేడా వుందనీ చెప్పాలి. అంతే ఇంకేం లేదు. ముందుముందు అంతా నే చెప్తానుగా నీకెందుకు. నువ్వు ముందు ఆయనకి సమాధానం చెప్పుమరి' ఆయన ధీమాగా మాటాడేడు.

'మమ్మల్ని కొట్టినాళ్ళు ఆళ్ళుకాదని చెప్పాలా?'

'ఒరేయి రాజా', విలను సంబోధన శృతిమించింది. 'ఆళ్ళకిమాత్రం చంపాలనుందేమిటి మిమ్మల్ని. నాలుగు తగిలేస్తే జోలికి రాడని బెదరేద్దామనుకున్నారు. ఆడు కాస్తా చచ్చూరుకొన్నాడు. ఆడికేముందిలే, తెలివితక్కువ ఎదవ. తిక్కపని చేసు






బోయేడు అనుభవించేడు. నువ్వు అదే తిక్కగా మాటాడతావేంటి? నీకొచ్చే డబ్బు జూసుకో, నీ పేణాలూ వుద్యోగం జూసుకో. ఆ సినిమా హాల్లోనేగా నువ్వుండేది. నాకాడు తెలుసులే. మనమెంత జెప్తే అంత. అయినా కాని ఆళ్లకి శిచ్చ ఏయించినా చచ్చినోడు తిరుగొస్తాడేరా? నాకు తెలీకడుగుతా. ఏదో అలా జరిగిపోయిందంతే. ఏం జేస్తాం దానికి' ఆయన వేదాంతంకూడా మాటాడుతున్నాడు. ఆయన మాటలు వింటూంటే రాజాకి, ప్రెసాదుప్రాణాలు ఎత్తుకుపోయిన రాత్రీ, వాళ్లిద్దరూ బాధతో కొంకర్లు తిరిగిపోయిన క్షణాలూ జ్ఞాపకం వచ్చాయి. ఆ అన్యాయానికి ప్రతీకారం తీర్చుకోవటం కూడా దురాశే అవుతుందా?

అతని హృదయం బాధగా మూలిగింది. హృదయంలోపల పొరల్లో ఎక్కడో 'ప్రాణమిత్రులం' అనే మాట వినిపిస్తోంది. (ప్రెసాదుగాడి నవ్వుముఖం కళ్లు మూసుకొన్నా కనిపిస్తోంది.)

కాని...నల్లటినీడలు...వాటి చేతుల్లో ఇనపచువ్వలు. అవి తనని వదలవు. వేటాడుతాయి. వెంటాడి పగతీర్చుకుంటాయి ...

చింకిచాపమీద ఇంకో నోట్లకట్ట పడింది. వాటి వెనక నీడలనీడ కూడా పడని జీవితం తళుక్కుమని మెరిసింది. పొట్టి నిక్కర్ల మనుషులు కోపంగా ఆత్రంగా చూస్తున్నారు. విలను చుట్ట నోట్లో బిగించి సాలోచనగా చూస్తున్నాడు. ప్లీడరు బాబు మోకాళ్లమీద చేతులేసి కుర్చీని గోడల్ని పరిశీలిస్తున్నాడు. 'లాభం లేదు ఒడూ ఆడిలాటోడే' అన్నాడు విలను మనలో తను అనుకుంటున్నట్లు.

కాసేపు ఆ గదిలో గాలినిండా మెత్తటి క్రూరత్వం నిండిపోయింది.

రాజాకి హఠాత్తుగా చాలా భయం వేసింది. ఆ నిశ్శబ్దం భరించలేనట్లుగా వుంది. ఆ [illegible] ఆలోచించటం మానేసి అందరి వంకా తిరిగి 'మీ యిష్టం బాబూ' అన్నాడు ... బలవంతుడి ఆజ్ఞకి [illegible] బలహీనుడిలా.

* * *

[illegible] ఆ తలుపు చూసింది. ఆ [illegible] ఆ చిన్నగదిలో రాజ్యం చేసిన [illegible] ప్రశాంతత, మనసుల్లో రేగే [illegible] తుఫానులూ దానికి తెలిసేయి. [illegible] దానికి చీకటంటే భయ్యం వేయలేదు.

ఇది జరిగిన ఆరునెలలకి మళ్లీ ఓరోజు సాయంత్రం అయింది. సూర్యుడు అలవాటు ప్రకారం అస్తమించేముందు జేగురు రంగు కిరణాలు ప్రసరింపజేస్తున్నాడు. గోడపక్క మురికి కాలవలో రెండు పెద్దసైజు పందులు విశ్రాంతి తీసుకుంటున్నాయి. పెద్దింటిగోడలు రెండూ గర్వంగా నిటారుగా నిలబడివున్నాయి. తాళం వేసున్న తలుపు ఒంటికాలుమీద తపస్సుచేసే మునిలాగా వుంది.

ఆ సమయాన సందుచివర ఓ చిన్న సంచీ పట్టుకుని నడచుకుంటూ ఓ వ్యక్తి వచ్చేడు. అతని గడ్డం మాసిలేదు. కళ్లు లోతుకు పోలేదు. శుభ్రమైన పాంటూ చొక్కా వేసుకున్నాడు. తిండికి లోటులేనివాడిలా ఆరోగ్యంగా వున్నాడు. సందు మొగన ఎవరో పలకరించేరు. అతను చెప్తున్నాడు 'అవును కేసు కొట్టేశారు ఆళ్లిద్దరినీ వదిలేస్తున్నారు' 'మరే. అసలు వాళ్లు దొరకటం మాటలేంటి! ఈపోలీసోళ్లు పుసుక్కున పాత కేడీల్ని లాక్కొచ్చేస్తారు ప్రతిదానికీ...' అనేసి పలకరించిన పాటి గేటుకీపరు వెళ్లిపోయేడు.

ఆ వ్యక్తి—రాజా అనే పేరుగల పక్క పాపిడితీసి దువ్వే అబ్బాయి అలవాటైన సందులో నడుస్తూ వచ్చేడు. తలుపు తాళం తీసి లోపలికెళ్లేడు. చీకటిగావుంది. బుడ్డిదీపం వెలిగించాడు. గది మధ్యగా చింకిచాప కనబడింది. అక్కడే ప్రెసాదు ఓరాత్రంతా చచ్చిపడున్నాడు. హాస్పటల్‌నుంచి వచ్చిన రోజు జ్ఞాపకం వచ్చింది. కాని ఇవాళ ఎవరూ తన గదికి రారు. సాక్ష్యం చెప్పటానికి ట్రైయినింగు ఇవ్వరు. అటు ప్రసాదు కూడా వెళ్లిపోయేడు. ఈరోజు తను ఒంటరివాడయిపోయేడు.

బాగా చీకటిపడింది. దీపం మిణుకు మంటూ వెలుగుతూంది. రాజా ఆలోచిస్తూ పచార్లు చేస్తున్నాడు. జీవితంగురించి ఆలోచిస్తున్నాడు. ఇకముందు ఏం చేయాలా అని ఆలోచిస్తున్నాడు. తను అర్థం చేసికోలేకపోయిన ప్రెసాదు ప్రేమనిగురించి ఆలోచిస్తున్నాడు. ఆలోచిస్తూ నడుస్తున్నవాడల్లా హఠాత్తుగా ఆగిపోయేడు.

తలుపు. తలుపు పైభాగాన శ్రీరామ అని సుద్దముక్కతో రాసిన అక్షరాలున్నాయి. ప్రెసాదుగాడు రాసేడుగదిలో కొత్తగా జేరినపుడు. నిద్రలేవగానే ఆ శ్రీరామ కనబడాలిట! రాజాచూపులు పైనుంచి క్రిందకి వచ్చాయి. అక్కడ గయోపాఖ్యానం డ్రామా కాగితం అంటించివుంది. సంవత్సరం పైనవుతుందేమో ఆ డ్రామామాసి, అనుకున్నాడు. దానిపక్కన అతికించివున్న ఇంకో బొమ్మదగ్గర అతని చూపులు ఆగిపోయాయి. 'ప్రాణమిత్రులు'లో నాగేశ్వరరావు, జగ్గయ్య నటించిన దృశ్యం, అని కింద రాసుంది. ఆబొమ్మ చాలా పాతబడిపోయింది. రాజా దానిదగ్గరకెళ్లి చూస్తూ నిల్చుండిపోయేడు చాలాసేపు.

తరువాత కాసేపటికి రాజా హఠాత్తుగా ఆ చింకిచాపమీదపడి భోరున ఏడ్చేడు, హృదయంలో బరువంతా తీరిపోయేట్లు. పశ్చాత్తాపం లాంటి భావం ఏదో హృదయాన్ని కాలుస్తూంటే బెంగగా బాధగా దిగులుగా ఒంటరిగా ఆగది మధ్యని పడి బిగ్గరగా రోదించేడు. పాతబడి చిల్లులు పడిన తలుపూ, మాసిపోయి బూజుపట్టిన గోడలూ, అవన్నీ అతను ఏడుస్తోంటే నిర్లిప్తంగా చూసేయి.

ఓ గంటసేపు ఏడ్చి అలసిపోయిన రాజా గభాలున లేచి ఓ పక్కన పడివున్న పాతరేకు పెట్టెలో బట్టలన్నీ సర్దేశాడు. బట్టల అడుగున రెండు కొత్తనోట్లకట్టలు తడిమి చూసేడు. తరవాత పెట్టె మూసేసి, ముఖం తుడుచుకొని, దీపం ఆర్పేసి గదిని చీకటి చేసేసి తెల్లబోయి చూసి తలుపుని తాళం వేయకుండా చీకట్లో వదిలేసి చకచకా అడుగులేసుకుంటూ ఆ సందులోంచి బయటికి వెళ్లిపోయాడు.

నిర్ఘాంతపోయిన గోడలు చీకట్లో, కాసేపటికి తేరుకుని నిశ్శబ్దాన్ని పలకరించాయి!

కాని అప్పట్నుంచి ఆ తలుపుకి మాత్రం చీకటంటే భయం పట్టుకుంది. ఆక్షణం నుంచి చీకట్లో దానికి భయంగా వింతగా ఎన్నో సంఘటనలు పుంఖాను పుంఖంగా జ్ఞాపకం వస్తున్నాయి. ఆ జ్ఞాపకాలు విశృంఖలంగా నృత్యం చేస్తే — బెదరిపోయిన పాత తలుపు ముసలి తత్త్వవేత్తలా చీకటికేసీ, అప్పుడప్పుడూ మెరిసే నక్షత్రాలకేసీ, వీధిగీపం గుడ్డి వెలుతురులోకీ చూస్తూ ఆలోచిస్తూ వుంటుంది.

# సౌదామిని కథ



## క్షేమేంద్రుని బృహత్కథామంజరి కథలు...

### అనువాదం: తిరుమల రామచంద్ర.........

మృగాంకదత్తుడు శశాంకవతి నే స్మరిస్తూ, తన మిత్రులతో పాటు ప్రయాణం సాగించాడు. దారిలో వింధ్యాటవి తగిలింది. తమాల తాల హింతళాది వృక్షాలతో నల్లగావుండే వింధ్యాటవి భూదేవి దీర్ఘవేణిలాగ వుంది.

వారంతా రాత్రి ఆ అడవిలో ఒకచోట పడుకొని, తెల్లవారగానే మేల్కొన్నారు. కళ్ళు తెరిచి చూడగా, ఎదుట ఒక మనిషి గుడ్డ కప్పుకొని పడుకున్నట్లు కనిపించింది. అతడు ఎంతోదూరం నడిచి అలసి సొలసి పడుకున్నవాడిలాగ అగుపడ్డాడు. మృగాంకదత్తుడు కుతూహలం కొద్దీ అతడు కప్పుకొన్న గుడ్డ ముఖంమీద కొద్దిగా తొలగించి చూచాడు. ఆశ్చర్యమయింది. అతడు విచిత్రకథుడు. 'ఏమిటిది! ఇలా హఠాత్తుగా ఎలా ఆకాశంనుంచి ఊడిపడ్డాడు!' అనుకుంటూన్న వారందరికీ, ఆయన సమాగమం అమృతం ఆస్వాదించినంత హాయి కలిగించింది. మృగాంకదత్తుడు తన వృత్తాంతం, తనతోటి వారిసంగతి అతనికి తెలియజేసి, అతని సంగతి అడిగాడు. విచిత్రకథుడు ఇలా చెప్పసాగినాడు.

'దేవ, నేను ఆనాడు నాగరాజు శాపంతో ఎక్కడో దూరంగాపోయి పడ్డాను తేరుకొనిచూడగా, అక్కడ ఒక పట్నం, దానిలో ఒక రత్నాలు పొదిగిన బంగారు భవనం కనిపించాయి. ఆ భవనంలో ఒకడు దివ్య రత్నశోభితుడు కనిపించాడు. అతని పక్కన ఇద్దరు సుందరీమణులున్నారు. అక్కడ నాలాగ అడుక్కునేవారెవరుదు. అలాంటి చోట అతడు నన్ను ఎంతో ఆదరంతో సత్కరించాడు. స్నాన భోజనాలకు ఏర్పాటు చేశాడు. నా సంగతి విని ఊరట మాటలు పలికాడు. అతని పక్కనవున్న వనితల మాటలనుబట్టి అతడొక యక్షనాయకుడని తెలుసుకొన్నాను అతడు సకల శాస్త్రవేత్త అని తెలిసి నా మిత్రవియోగ వ్యాధికి చికిత్స ఏమిటని అడిగాను. అతడు నాతో ఇలా అన్నాడు:

'నాయనా, ఈ మానవులు సుడిగాలిలో కొట్టుమిట్టాడే దూది నలుసుల వంటి వారు. సుడిగాలి వంటి ఈ సంసారంలో దైవసంకల్పంతో మిత్రసమాగమం సంభవిస్తూనే వుంటుంది. ఈ దేహమున్నంతవరకు మందులేని వ్యాధి అంటూ వుంటుందా? వియోగసారమయిన ఈ సంసారంలో మనకు ఇష్టులయినవారిమీద ప్రేమ వుండడమనేదే ఈ వియోగానికి మందు. వారాంగనల కనుబొమలలాగ నాట్యమాడే ఈ సంసారంలో ఎవరినిమాత్రం సంయోగ వియోగాలు ముంచెత్తవు? నేను యక్షుణ్ణయినప్పటికీ, పూర్వం మనుష్య జన్మలో సుఖదుఃఖాలు — దుస్సహమయినట్టివి — అంచెలంచెలుగా అనుభవించాను. ఆ సంగతి చెబుతాను విను.

త్రిగర్తదేశంలో పవిత్రధనుడనే బ్రాహ్మణుడు ఉండేవాడు అతడు చాల దరిద్రుడు. అందువల్ల అడవికి పోయి, ఒక యక్షిణిని ఉపాసించాడు. ఆమె అతనికి ప్రసన్నురాలైంది. ఆమె పేరు సౌదామిని. ఆమె అతనికి సహచరిగా వుండడానికి నిశ్చయిం

ంది. దానితో అతనికి అపార ధనమూ, అపూర్వ సుఖాలూ లభించాయి

ఆ విప్రుడొకమారు తన ప్రియురాలితో 'ప్రియే, నీ అనుగ్రహంవల్ల నాకు అపూర్వమయిన సుఖం లభించింది. అది నా మనస్సును ఆనందపెడుతున్నది. నీవల్ల సంపూర్ణ సర్వసంకల్పుడయిన ఒక పుత్రుడు కలిగితే, నా పుణ్యాలకు, సంతోషాలకు, గొప్ప ఫలంగా భావిస్తాను' అని అన్నాడు.

భర్త మాటలు విని, సౌదామిని ఇలా అన్నది: ఆమె మాట్లాడుతున్నప్పుడు మరింతగా మెరిసిపోతున్న ఆమె ఎర్రటి పెదవులు ఆమె మనస్సులోని అనురాగమంతా గడ్డకట్టి పైకి వచ్చిందా అన్నట్టు తోచింది. ఆమె ఇలా అన్నది:

'నేను తమాలవనంలో నివసించే పృథూదరుడనే యక్షరాజు కుమార్తెను. నీవేమో పూర్వజన్మలో యక్షరాజయిన ధనపతి కుమారుడు అట్టహాసుడివి ఎంతో సుందరుడివి. నా తండ్రి ఆజ్ఞతో నేను నిన్ను వరించాను నీవు మహానందం పొందావు.

'ఒకమారు నీకు తండ్రివేషంలో వినోదించాలనే ఆశ కలిగింది. నీ సోదరుడు దీప్తశిఖుడు నలకూబరుని వేషంతోను, నీవు నీ తండ్రి కుబేరుని వేషంతో వినోదిస్తున్నారు. నలకూబరుడు గగనమార్గంలో ఎక్కడికో వెళ్ళుతూండగా ఈ విచిత్రం కంటబడింది. వెంటనే కోపోద్రిక్తుడై నిన్ను 'తండ్రిలాగ వేషం వేశావా? మనుష్యుడవై పుట్టు' అని శపించాడు. నీవు శాపమోక్షం అనుగ్రహింపుమని కోరావు. అప్పుడు నలకూబరుడు 'దుర్మార్గుడవైన నీకు నా రూపంతో సౌదామినియందు నీవంటివాడు గర్భదీప్తశిఖుడనే కుమారుడు కలుగుతాడు. అప్పుడు, నీకు శాపమోక్షం కలుగుతుంది.' అని దయ చూపాడు.

'ఆ శాపంవల్ల నీకు ఈ దేహం కలిగింది. నేను నా నెచ్చెలుల మాటలవల్ల ఈ సంగతులన్నీ తెలుసుకొని, ఈ రూపం ఎత్తాను. నీశాపం పోగొట్టడానికి త్వరలోనే కుమారుడు కలుగుతాడు.'

సౌదామిని ఇలా అని ప్రౌఢగా చాలా కాలం అతనిని సుఖంలో ఓలలాడిస్తూ, కుమారుని కన్నది.

కుమారుడు కలుగగానే, శాపం తొలగి వహ్నిశిఖుడు మానవరూపం పోయి అట్ట

# ...బృహత్కథామంజరి

హాసుడయ్యాడు తన కుమారుణ్ని రహస్యంగా తను పుట్టిన బ్రాహ్మణుని ఇంట్లో వదలి సౌదామినితోపాటు వెళ్ళిపోయాడు. పోతూ ఆ కుమారుని పోషణ కోసం బంగారు, రత్నాలు ఆ పిల్లవాడి పక్కనే వుంచాడు.

ఆ బ్రాహ్మణునిపేరు దేవదర్శనుడు. తెల్లవారి లేవగానే తనయింట్లో పాపడు ధనరత్నాలతోపాటు వుండడం చూచి, ఆనందించాడు. అతనికి శ్రీదర్శనుడనే పేరు పెట్టాడు.

అతడు పెద్దవాడయిన తర్వాత సకల విద్యలు, సకలకళలు నేర్చాడు. శస్త్రాస్త్ర యుద్ధ కుశలుడూ అయ్యాడు. గొప్పకవీ అయ్యాడు.

దేవదర్శనుడు ఒకమారు యాత్రకు వెళ్ళాడు. త్రివేణీసంగమంలో దేహం వదలి తన పుణ్యబలంతో దేవలోకం చేరాడు. అతనిభార్య దుఃఖంతో సహగమనం చేసింది. శ్రీదర్శనునికి హితం చెప్పే పెద్దలెవరూ లేరు అందువల్ల, అతడు జూదరి అయి ఆస్తంతా కోల్పోయాడు. మట్టికొట్టుకున్న శరీరంతో ఎక్కడబడితే అక్కడ, భుజం తలక్రింద పెట్టుకొని పడుకుంటూ, గుడ్డ గుడుసూ లేక, తిండీ తిప్పలూ లేక తిరిగే జూదర్లగుంపులో పడ్డాడు. తిండి మానేశాడు. ఎవరినీ చూచేవాడు కాడు, ఎప్పుడూ నిశ్చలంగా దేనినో ధ్యానిస్తూ, యోగిలాగ అయ్యాడు. ఈ పాడుబ్రతుకు ఎందుకని చచ్చిపోదామనుకున్నాడు.

అతనికి ముఖరకుడనే స్నేహితుడున్నాడు. అప్పుడు అతడు శ్రీదర్శనునితో ఇలా అన్నాడు :— 'మిత్రుడా, నీవు ధీరుడివి. విద్వాంసుడివి. నీకు కూడా మోహమా? నీవు వివేకవంతుడివి. నీకు ఈ భ్రాంతి ఎందుకు? నీబోటివాడు ధనమనే దుమ్ము లేదనే నిరాశతో దేహం వదులుకుంటాడా? ఈ దేహం త్రివర్గ సాధనమయింది. ఆపదలు వచ్చినప్పుడు దీనిని రక్షించుకొనేవాడు ఈ దేహంతో ఏమి సాధించలేడు! ఈ దేహమే రాబోయే కల్యాణ సంపదలకు సాధనం. సర్వార్థ సిద్ధులనే రత్నాలకు ఈ దేహం క్రయవిక్రయ భూమి. ఒక ఉదంతం చెబుతాను విను :

'మోక్షలక్ష్మికి ముత్యాలసరం అనదగిన వితస్త అనే నది వుంది. ఆ నది తన తరగలనే కదలాడే కనుబొమ్మలతో పాపాన్ని బెదిరిస్తున్నదా అన్నట్టు వుంటుంది. ఆ పవిత్ర నదీలీలాతరంగాలలో పాపాలను పోగొడుతున్న ఒక మండలం వుంది. అది కాశ్మీర మండలం. సర్వ సంపదలకు మండలం. అక్కడి స్త్రీలు మహా సుందరులు. కాంతి తరంగాలు కదలాడే వారి కపోలాలలో ప్రతిఫలించిన చంద్రుడు తను అమృతంలో పుట్టిన నాటి సుఖాన్ని అనుభవిస్తున్నాడా, అనిపిస్తుంది. అక్కడ ఉష్ణాంశువయిన సూర్యుడు ఎండ వేడిమి చూపడు. అతని కిరణాలు కుసుమ సుకుమారాలుగా వుంటాయి అక్కడ సరస్వతి లావణ్యనవనీతంతో రూపొందిందా అన్నట్టు, మధుర మనోహర అయి కవుల ముఖరంగంలో ముత్యాలహారాలు, నూపురాలు, మొలనూలు గణగణలాడగా నాట్యం చేస్తుంది.

ఆ మండలాన్ని భూనందుడనే రాజు పాలించేవాడు. అతడు భూమికే అలంకార ప్రాయుడు. కర్పూరంలాగ తెల్లగావున్న అతని బాహుదండం శేషనాగంవలె భూభారం వహించింది,

అతడు ఒకమారు ద్వాదశినాడు ఉపవాసంచేసి పడుకున్నాడు. ఇంకా రాత్రి మిగిలింది. అప్పుడతనికి కల వచ్చింది. కలలో నయనామృతం వంటి ఒక అసురకన్యను చూచాడు. మేల్కొన్న తర్వాత, అతనికి ఆ కన్యమీదే మనసు పోయింది. ఈ సంసారంలో స్వప్నమనేది మరొక సంసారం. దానిలో రాగం కూడా రాగవంతుల మనస్సును మారుస్తుంది. అతనికి లోకాలన్నిటినీ జయించిన మన్మథుడు చెప్పరాని పాటు కల్పించాడు. ఆయన స్థితికి మంత్రులకు దుఃఖం కలిగింది. అతడు మన్మథ తాపం భరించలేకపోయాడు. తన తమ్ముడు సునందునికి, మంత్రులసమ్మతితో రాజ్యం అప్పగించి శోకనాశిని అయిన విశోక అనే అడవికి తపస్సు చేసుకోడానికి వెళ్ళిపోయాడు.

ఆ విశోకారణ్యంలో క్రమసారమనే విష్ణుతీర్థమయిన పుణ్య సరస్సు వుంది. అక్కడ బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు పర్వతాలై వుండిపోయారని ప్రతీతి. ఇక్కడే విష్ణువు బలిని పాతాళానికి అణచివేశాడని

ఐతిహ్యం. బలిని అణచివేసిన విష్ణువు పాదాన్ని నక్షత్రాలు చిరుగజ్జెలుగా అలంకరించాయి. ఆకాశగంగ తెల్లని పట్టు పుట్టంవలె కప్పింది. అది భూమినుంచి మీదికెత్తిన కేతుదండమా అన్నట్టు వుండేది.

భూనందనమహారాజు చాల సంవత్సరాలు అక్కడ నియమనిష్ఠలతో తపస్సు చేశాడు. కాని, ఆయనలో మాత్రం పదకొండవ మన్మథదశ మండుతూనే వుండిపోయింది.

ఒకసారి ఆ రాజు ఆశ్రమానికి శంకరునిలాగ వెలిగిపోయే ఒక తపస్వి వచ్చాడు. రాజు అతనిని సత్కరించి, నిజ వృత్తాంతం అడిగాడు. ఆ తపస్వి ఇలా చెప్పాడు తనకథ:—

'నేను యజుస్సు అనే ఒక దాక్షిణాత్య బ్రాహ్మణుని కుమారుణ్ని నాపేరు విభూతి వసువు శివాగమాలు బాగా అధ్యయనం చేసి; అచార్యపదవి పొందాను శ్రీ పర్వతానికి వెళ్ళి తపస్సుచేసి ఉమాపతిని సాక్షాత్కరించుకొన్నాను. నేను అతనికి నమస్కరించి ఫలసిద్ధికి ఉపాయం సెలవియ్యమని ప్రార్థించాను ఉమాపతి ఇలా సెలవిచ్చాడు:—

'పూర్వం బాణాసురునిచే అనిరుద్ధునికి యుద్ధం సంభవించింది. బాణుని కుమార్తె అనిరుద్ధునితోపాటు ద్వారకనుండి బయలు వెడలి ఉద్యానంలో ప్రవేశించింది. అనిరుద్ధునికి ఉద్యానాలంటే ఎక్కువ ప్రీతి అని గ్రహించి, ఆ బాణకన్య అతనిని మయుడు సృష్టించిన ప్రాంతంలోని ఉద్యానవనానికి పిలుచుకొని పోయింది. పుత్రవత్సలుడయిన ప్రద్యుమ్నుడు తన కుమారుడు బాణపుత్రితో వెళ్ళడం విని, 'భగవాన్, అనిరుద్ధుడు ఎక్కడున్నాడు?' అని ప్రశ్నించాడు, కృష్ణుణ్ని. 'అనిరుద్ధుడు పాతాళోద్యాన వనంలో వున్నాడు. బాణపుత్రితో మన్మథ లీలలలో వున్నాడు. పాతాళానికి కాశ్మీరమండలంలో ఒక దారి వితస్తా నదిలోను, మరొకదారి భూమిమీద వున్నాయి. నీవు భూమిమీద వుండే దారికి కాపలా పెట్టించు. అనిరుద్ధుడేమో క్రీడాలోలుడై వున్నాడు అసురులు చాలా మాయలు ఎరిగినవారు.' అని కృష్ణుడు చెప్పాడు.

కృష్ణుని మాటప్రకారం ప్రద్యుమ్నుడు భూమిమీద వుండే బిలమార్గంవద్దకు వెళ్ళి, ఒకపర్వత శిఖరంతో దానిని మూసివేశాడు. త్రినేత్రునివల్లభ అయిన పార్వతిని ఇలా స్తుతించారు:—

'దేవి, నీపాద కమలద్వయాన్ని దేవతలు తలలు వంచి నమస్కరిస్తున్నారు. అప్పుడు వారి కిరీటాల ఇంద్రనీలమణులు నీపాద కమలాలమీద ప్రసరించి, తుమ్మెదలు పారాడిన శోభను కలిగిస్తున్నాయి. అలాటి నీకు జయమగుగాక. చిదాకాశానికి వెన్నెలవంటిది (చిద్గగన చంద్రిక), విబోధమనే కలువల వనాన్ని ఆనందింపజేసేది, చిరునవ్వులు వెలయిస్తుండేదీ అయిన గౌరీదేవి విరాజిల్లుతున్నది. దేవి తాండవం చేస్తున్నప్పుడు, ఎర్రటికాంతులీనుతున్న రవి నీయొక్క అందె చివరిమాణిక్యంలాగ వెలుగుతున్నాడు ఓ మృడానీ, నీ చేతిలోని శూలదండం పలుమారు కదులుతూ ఎంత శోభ కలిగిస్తున్నది —అది కదలాడడం చూస్తే, రాక్షసుల రక్తంతాగి మత్తెక్కి తూలిపడుతున్నదా అన్నట్టువుంది. ఓకాళీ, నీ అట్టహాసపు తెల్లనికాంతులు మండలాలు మండలాలుగ ఆకాశమంతా వ్యాపించి, ఆకాశాన్ని భైరవీమయంగా చేస్తున్నది. ఓ రుద్రాణీ, నీవు రాక్షసులతో యుద్ధం చేస్తున్నప్పుడు నీ ఖడ్గంలో ప్రతిఫలించే రాక్షసుల ముఖాలూ చూస్తుంటే, అవి తెగిపోయి ఖడ్గంలో ప్రవేశిస్తున్నాయా అన్నట్టు వుంటుంది. ఓ భైరవీ నీ దేహం తాండవసమయంలో బ్రహ్మాండాన్ని మించిపోయింది. ఒకవైపు ఢమరుకం ప్రేలాడుతూ, మరొకవైపు విలాసంగా ఎత్తుకున్న కరాళంతో భయం గొలుపుతూ వుంటుంది ఓ దుర్గా, నీవు కోపంతో మహిషాసురుణ్ని చూచావు, వాడు నీ ముఖ చంద్ర కిరణాలు తాకిన చీకటిముద్దగా దేవతలకు కనిపించాడు. దేవీ నీవు కమఠినీ కందకుండలినివి. నాదబ్రహ్మ సంయుతురాలివి. మధుబిందు విరాజితవు దేవీ నీవు మెడలో ధరించిన బ్రహ్మ కపాలమాల రుద్రునికి అనేక కల్పాంతగణనలాగ వున్నది'

పుత్రుడయిన అనిరుద్ధుని రక్షణకోసం ప్రద్యుమ్నుడు స్తోత్రం చేయగా, దేవి శారికా రూపంలో అతనివద్దకు వచ్చింది. అక్కడ నేటికీ దేవి ప్రద్యుమ్న పర్వతశిఖరం మీద శిలారూప శారికగా విరాజిల్లుతూ సిద్ధ సాధ్యులకు ఆరాధనీయగా వుంది.

ప్రద్యుమ్నుడు తర్వాత ద్వారావతి చేరాడు. ముని శాపంవల్ల యాదవులు తమలో తాము కొట్టుకొని నశించిపోయారు. ఉషాదేవి పాతాళమందిరంలో దైత్య కాంతలతో వున్నది—అని శివుడు నాకు సకల సిద్ధులు ప్రసాదించాడు. నేను ఐదుగురు శిష్యులతోపాటు ఆ నదీమార్గంలో పాతాళం ప్రవేశించ దలచాను రాజా, నీవు కూడా నాతో రా. నీ మనోరథం నాకు తెలుసు.' అన్నాడు.

భూనందుడు ఆ తపస్వి మాటలకు ఉత్సాహితుడై అతనితోపాటు కాశ్మీరు మండలానికి బయలుదేరాడు.

(ఇంకా వుంది)



# భ్రమల బాటలు

పి. సత్యవతి



పగలంతా ఎండ తీవ్రంగా వుండి, వుండి సాయంత్రానికైనా చల్లని గాలి తిరిగి, సేద తీరుస్తుందని ఆశపడినప్పుడు, కారుమబ్బులు మునిరి జడివాన కురిసినట్లయితే ఎల్లా వుంటుందో అలా అనిపించింది సుమిత్రకి. చిన్నన్నయ్య వ్రాసిన ఉత్తరం చదవగానే....

*ఆశాభంగాలనేవి కొత్తగా అలవాటులేని జీవితం కాకపోయినా, ఈ సంఘటన ఆమె మనస్సుని బాగా కలచి వేసిందనే చెప్పాలి.*

ఉత్తరం మడిచి టేబిల్ మీద పెట్టి వరండాలోకి వచ్చి మంచంమీద నిస్సత్తువగా ఆకాశంకేసి చూడసాగింది సుమిత్ర.

గంగాధరం ఉత్సాహంగా ఈ ఉత్తరంకోసం ఎదురుచూస్తున్నాడు. భోజనానికి వస్తాడు. రాగానే ఉత్తరం చూస్తాడు. అమ్మకి ఏమని చెప్పాలి మాధవరావు. ఇప్పుడు వస్తాడు?

కొంచెం సావకాశంగా ఆలోచిస్తే చిన్నన్నయ్య వ్రాసిన విషయం తప్పేమీ కాదనిపించింది సుమిత్రకి. అప్పుడాలోచన రాగానే ఆమె మనస్సులో ఇంతకు పూర్వం కురిసిన జడివాన వెలిసినట్లయింది. ఎన్నో ప్రశ్నలు, వాటికి సమాధానాలు వాటంతటవే మెదడులో కదులుతున్నాయి. కొంతసేపటికి తేలికగా ఫీలవుతూ కళ్ళు మూసుకుంది సుమిత్ర.

వివేచనాశక్తి, స్వక్రమమైన ఆలోచనా



విధానమూ, స్పందించగల హృదయమూ కల వాళ్ళని సమస్యలంతగా వేధించి బాధించ వేమో ననుకుంది సుమిత్ర. తన వయస్సుకి ఈ మాత్రం వివేకం కలిగివుండడం తన అదృష్టమేమోననికూడా ఆమెకనిపించింది.

పెదవులమీద చిరునవ్వు చెదరనీయకుండా, కళ్ళల్లో వెలుగు తరగనీయకుండా, ఉత్తరం తీసుకునివెళ్ళి పెద్దన్నయ్యకిచ్చింది సుమిత్ర.

ఆంధ్రదేశంలోని అనేకానేక కుటుంబాలను పీడిస్తున్న ఏకైక సమస్య ఆడపిల్ల పెళ్ళి. ఈ ఉత్తరంతో, తనపైగల బాధ్యత వదిలిపోగలదని, తన సమస్య పరిష్కారం అవుతుందని ఆశపడుతూ, గర్వంగా చిరునవ్వు నవ్వుకుంటూ-కవరు విప్పాడు మాధవరావు.

అన్నయ్యకి నమస్కారం.

నీ ఉత్తరం అందింది. దానికి జవాబు ఇలా వ్రాయవలసి వచ్చినందుకు బాధపడుతున్నాను. సుమిత్ర పెళ్ళికీ, నా వివాహానికీ లంకెపెట్టి, కట్నండబ్బు ఆ చేత్తో

# కొత్త సీరియల్ ప్రారంభం!

తీసుకుని ఈ చేతోత్తో యిచ్చేసి, పెళ్ళిళ్ల కయ్యేఖర్చూ కలిసివచ్చేలాగు చూడడం అవివేకం అని చెప్పడానికి విచారంగా వుంది వాక్కులుగా సుమిత్రకీ, నాకూ, నీకూ మనందరికీ ఉద్దేశ్యాలూ, ఆదర్శాలూ వుండడంలో తప్పులేదు. నేను రాధ అనే అమ్మాయిని పెళ్ళి చేసుకోబోతున్నానని అదివరకే సూచనగా చెప్పాను. ఈ సంగతి తెలిసీ మీరు రాజమండ్రి సంబంధం చేసుకోమని వ్రాయడం సాహసమే. సుమిత్ర విషయంలో మీకెంతబాధ్యత వున్నదో నాకూ అంతే వున్నదనీ తెలుసు. అందుకనే పదిహేడేళ్ల సుమిత్రకి యిప్పుడే పెళ్ళి చేయడం మంచిది కాదని చెబుతున్నాను. ఆమెని కాలేజీలో చేర్పించండి. ఖర్చు నేను భరిస్తాను. పెళ్ళికయ్యే కట్నం ఇప్పుడప్పుడే ఒక్కసారిగా నేను యివ్వనూ లేను — మరీ తొందరైతే ఇంట్లో నా భాగం అమ్మి పెళ్ళి జరిపించండి. నేను కాదనను

ఈ విషయం జాగ్రత్తగా ఆలోచించండి. నా పెళ్ళి ఇరవైనాలుగో తేదీన. ఇది కులాంతరం కనుక మీరు రాలేరని తెలుసు వస్తే చాలా సంతోషం.

రఘుపతి.

చెళ్ళున చెంపమీద చరిచినట్లైంది మాధవరావుకి. ఆవేశంతో ముఖం ఎర్రబడింది. రెండు నిముషాలు కుర్చీలో ప్రతి

# బ్రతుకుబాట

మలా కూర్చుండి పోయాడు.

ఇంతలో అతని అర్ధాంగి ఇందుమతి మంచినీళ్లగ్లాసుతో అక్కడికి వచ్చింది.

'జరిగిందేదో జరిగింది—ముందు భోజనానికి లేవండి' అన్నది.

''పెళ్ళి భోంచెయ్ అన్నయ్యా! ఇప్పుడేమీ వాదోపవాదాలు వద్దు' అమ్మ అసలే దిగులుపడి పోయింది. మనం గట్టిగా మాట్లాడుకుంటూవుంటే ఆవిడ పరిస్థితి మరీ అన్యాయం అవగలదు—' అన్నది సుమిత్ర.

'ఎలావుంది ఆవిడ?' అన్నాడు మాధవరావు కుర్చీలోనుంచి లేచి గట్టిగా నిట్టూరుస్తూ—

'ఉత్తరం చదవగానే వొళ్ళంతా చెమట పట్టేసింది. గుండెదడ వచ్చింది తలకాయ తిరుగుతోందని పడుకుంది' అన్నది సుమిత్ర నెమ్మదిగా.

'పోనీ నేను విశాఖపట్నంవెళ్ళివచ్చేదా?' అన్నాడు మాధవరావు ఏదో నిర్ణయించుకున్నట్లు.

'అనవసరం—అతడినిర్ణయం ఏనాటికీ మారదు—మీరువెళ్ళి అవమానం పొంది రావడం పిచ్చితనం' అన్నది ఇందుమతి గట్టిగా.

'అదీ నిజమే' అనుకున్నాడు మాధవరావు—నిజానికి ఈ రోజుల్లో పదిహేడేళ్ల పిల్లలకి పెళ్ళిళ్లొందరేం లేదు—కానీ అమ్మకోరిక సుమిత్ర పెళ్ళి చూడడం. మూడేళ్ళుగా ఆవిడ క్షణక్షణం కలవరిస్తోంది సుమిత్ర పెళ్ళికోసం.

ఆడపిల్లలకి మెట్రిక్ వరకూ చదువు చాలని ఆవిడ దృఢ విశ్వాసం అందుకనే గత రెండేళ్ళుగా రఘుపతి నచ్చచెప్పినా ఆవిడ సుమిత్రని కాలేజికి పంపడానికి వొప్పుకోలేదు — సుమిత్ర యింట్లోనే వుండపోయింది.

కట్నం తీసుకోడమనేది చాలా పెద్ద నేరంగా పరిగణించే రోజులు యింకా రాలేదు. అలాంటి వ్యక్తులూ తక్కువే. మనం యిచ్చేటప్పుడు తీసుకుంటే మాత్రం తప్పేమిటి అనేది మాధవరావు అభిప్రాయం. ఆదర్శాలు వల్లిస్తూ కూర్చుంటే సమస్యలు తీరవు — ఏదో ఒక విధంగా పరిష్కారాలు సాధించుకుని జీవితాన్ని సుగమం చేసుకోవాలికదా అని తను రఘుపతికి రాజమండ్రిలో ప్లీడరుగారమ్మాయి సంబంధం చూశాడు అమ్మాయి బాగుంటుంది. పి. యు సీ చదివింది. కట్నం ఎనిమిది వేలిస్తామన్నారు.

సుమిత్రకి కుదిరిన హైదరాబాదు సంబంధమూ మంచిదే కుర్రాడికి స్టేట్ బ్యాంకులో నాలుగొందలొచ్చే ఉద్యోగం, పల్లెటూళ్లో ఇల్లూ కొంచెం పొలమూ వున్నాయి. ఆరు వేలిస్తే సరిపెట్టుకుంటామన్నారు. ఈ రెండు పెళ్ళిళ్ళూ ఒకేసారి చేస్తే ఖర్చు కలిసివస్తుందని ఆశపడ్డమాట అబద్ధం కాదు. తనకి తల్లిదండ్రులిచ్చిన అపారమైన ఆస్తిపాస్తులేమీ లేకపోగా తండ్రి పోయినప్పటినుంచీ తల్లినీ చెల్లెలినీ ఆదరించి తమతో సమానంగా చూసుకోవడం అనేదికూడా చాలా కష్టమే తనకి. అయినా తాను వాళ్ళని వదులుకోలేదు. అదిచాలు తన మంచితనానికి. ఇందుమతి మౌనంగా భోజనం వడ్డించింది. మాధవరావూ మాట్లాడలేదు. సుమిత్ర తల్లి మంచందగ్గర కూర్చుని ఏదో నవల చదువుకుంటోంది కొడుకు భోజనం చేసి యివతలకి వచ్చిన అలికిడి విని మంచంమీద నుంచి లేచి వచ్చింది అన్నపూర్ణమ్మగారు.



'ఉత్తరం చదివావుగా?' అన్నది మహా తుఫాను రావడానికి నాందీ సూచనగా.

'ఊ!' అన్నాడు సాధ్యమైనంత నిర్వికారంగా వుండడానికి ప్రయత్నిస్తూ.

'నన్ను విశాఖపట్నం తీసుకుపో మాధవా! వాణ్ణి పెట్టవలసిన చివాట్లు నాలుగు పెట్టి వాడికీ నాకూ వున్న సంబంధం తెంపుకు వస్తాను – నాకు వొక్కడే కొడుకను కుంటాను—' అన్నదావిడ బొంగురుపోయిన కంఠంతో.

'ఊర్కోండి అత్తయ్యా—' అన్నది ఇందుమతి అనునయంగా.

'సంబంధం త్రెంచుకోడానికి అంత దూరం పోయి హైరాన పడక్కర్లేదమ్మా! ఒక్క ఉత్తరం వ్రాసి పడేస్తే చాలు' అన్నది సుమిత్ర, నవల మూసి వేస్తూ...

'స్వయంగా వెళ్లి గట్టిగా చివాట్లు పెడితే కాదంటాడటే వాడు! నా ముఖం చూసైనా కరిగిపోడా?'

సుమిత్ర నవ్వింది.

'కరిగిపోయే మనస్సు కలవాడికి ముఖం చూసి కరగాల్సిన పని లేదమ్మా—వాడి సంకల్పం వేరు. దానికి చాలా బలం వుంది ఎంతమంది ఎన్ని అన్నా వాడు చేసేపనికి వెనుదీయుడు. అదే వాడిలో వున్న గొప్పతనం' అన్నది.

'అది గొప్పతనం అని నువ్వు సమర్థిస్తున్నావా సుమిత్రా?' అన్నాడు మాధవరావు కోపంతో.

'మన సమర్థనలతో, నిరసనలతో, వాడికి పని లేదన్నయ్యా!! ఇహ మనం వాడికి రాజమండ్రి సంబంధం, నాకు హైదరాబాదు సంబంధం' అంటూ కలలు కనడం ఆపుకుని ప్రాక్టికల్‌గా ఆలోచించడం మంచిది—' అన్నది సుమిత్ర స్థిరంగా—

'అవును ఎవరికి వాళ్లే పెద్దవాళ్లయిపోయార్రా మాధవా! మన సలహాలు దేనికి వీళ్లకి! మనం పిచ్చివాళ్లం—రేపు, దీనికింకా రెండేళ్లు పెళ్లిచెయ్యక పోతే ఇదికూడా ఏ కులంవాణ్నో కట్టుకు పోగల సమర్థురాలు!' అన్నది అన్నపూర్ణమ్మగారు కటువైన కంఠస్వరంతో.

'అనవసరంగా ఆవేశపడకమ్మా, వాడు చెప్పినట్లు ఈ ఇల్లు అమ్మేసి దానికి పెళ్లిచేస్తాను—మనం ఎంత వాపోయినా, ఏం చేసినా విధిలిఖితం ప్రకారం జరుగవల

## రచయితలకు సూచన

### కథలు, వ్యాసాలు

ప్రచురణకి స్వీకరించబడని తమ వ్రాత ప్రతులని తిప్పిపంపగోరే రచయితలు వ్రాత ప్రతులతోబాటే తగుమాత్రం తపాలాబిళ్ళలు అతికించిన, స్వంత చిరునామాకల కవరు కూడా పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు. స్టాంపులు మాత్రం పంపించినట్లయితే వ్రాతప్రతులు తిప్పిపంపబడవు. వ్రాత ప్రతులతో గాక విడిగా స్వంత చిరునామా, తగుమాత్రం పోస్టేజికల కవర్లు పంపినా వ్రాతప్రతులు తిప్పిపంపబడవు.

ప్రచురణకి స్వీకరించబడని వ్రాతప్రతుల విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

### నవలలు

ప్రచురణకి స్వీకరించబడని నవలల వ్రాత ప్రతులు మేమే తిప్పి పంపిస్తాము. వ్రాత ప్రతులతో స్వంత చిరునామాకల, తగు మాత్రం పోస్టేజి అతికించిన కవర్లు పంప నవసరం లేదు. 100 అరఠావు పేజీలు పయిన ఉన్న వ్రాతప్రతులే నవలలకింద పరిగణింప బడుతాయి.

### కార్టూన్‌లు

ప్రచురణకి స్వీకరించబడని కార్టూన్‌లు తిప్పి పంపగోరేవారు కార్టూన్లతో స్వంత చిరునామాకల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు జతపరచి పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు.

**షరా:** వ్రాతప్రతులనీ, కార్టూన్లనీ వీలయినంత భద్రంగా తిప్పిపంపే ప్రయత్నాలు చేస్తాము కాని, వాటి విషయములో ఎటువంటి బాధ్యతనీ స్వీకరించలేము. ఈ షరతుని గమనించి రచయితలు తమ రచనలు, కార్టూన్‌లు పంపగలరు.

*సంపాదకుడు*

*ఆంధ్ర సచిత్ర వారపత్రిక*



సిందే కదా!' అన్నాడు మాధవరావు సిగరెట్ వెలిగించుకుని నిదానంగా —

'అప్పటినుంచీ ఇప్పటివరకూ నువ్వే నన్ను కనిపెట్టి వున్నావు నాయనా!' అంటూ కన్నీళ్ళు తుడుచుకుంది వృద్ధురాలు.

* * *

'ఏంచేద్దామంటావ్ అయితే?' అన్నాడు మాధవరావు గడ్డంక్రింద చేయి ఆనించుకుని, భార్య ముఖంలోకి పరిశీలనగా చూస్తూ — డాబామీద గాలి చల్లగా వుంది.

కొబ్బరి ఆకులమీదనుంచి బారలు బారలుగా వెన్నెల డాబామీద పడుతోంది. పిట్టగోడకి ఆనుకుని నిలబడింది ఇందుమతి.

'నేను చెప్పేది మీరు అర్థంచేసుకోగలరా?' అనే ప్రశ్నవుంది ఆమె కళ్ళల్లో రెండుక్షణాలు మౌనంగా వుండిపోయింది.

'చెప్పు ఇందూ? నువ్వు నాకన్న బాగా ఆలోచన చేయగలవు — మన చెలిమి ఇరవై ఏళ్ళది — నిన్ను నేనర్థం చేసుకోలేక పోవడమేమిటి!' అన్నాడు మాధవరావు మళ్ళీ —

'ఇరవై ఏళ్ళుగా ఎదుగూ బొదుగూ లేని ఉద్యోగంతో ఈ పట్టణంలో సంసారం లాక్కు వస్తున్నామంటే, వుండడానికి ఈ చారెడు ఇల్లైనా వుండబట్టే సరిపోయింది. లేకపోతే ఆ జీతంలోనించే ఇరవై, ఇరవై రూపాయలు అద్దె కట్టాల్సి వచ్చేది. ఇది కాస్తా అమ్మేకుంటే ఎలాగండీ!' అన్నది ఇందుమతి నిదానంగా, మెత్తగా.

'మరి మనం అంతకట్నం ఎక్కడినుంచి తేగలం ఇందూ?' అన్నాడు మాధవరావు వెంటనే —

'అతను అమ్మమన్నది అతని బాగమే అయినా, ఇల్లు సగభాగం ఎవరు కొంటారండీ! అమ్మితే పొంతం అమ్మాల్సిందే! అప్పుడు మనచేతికి నిండా పదివేలైనా రావు — అవి ఎంతకాలం వుంటాయి మనదగ్గర! అందుకని ఇల్లు అమ్మడం చాలా నష్టం —'

'నువ్వు చెప్పేది నిజమే! కానీ మరి అమ్మకెలా నచ్చజెప్పడం? సుమిత్ర పెళ్ళి ఆగిపోతే అమ్మ భరించలేదు ఇందూ!' అన్నాడు మాధవరావు బేలగా —

'ఏదైనా సమస్య వచ్చినప్పుడు అది చాలా క్లిష్టమైనదిగానూ, భరించ శక్యం కానిదిగానూ అనిపిస్తుంది. కానీ కాలక్రమేణా అది మామూలైపోతుంది. ఏ సమస్యకైనా పరిష్కారం కాలమే చూపిస్తుంది. ఆవిడ దుఃఖం, ఆవేదన కూడా కొద్దికాలం పోయాక ఇంత ఉధృతంగా వుండవు — ఆవిడే సర్దుకుపోతారు — రఘు చెప్పినట్లు సుమిత్రని కాలేజిలో చేర్పించండి — ఆ అమ్మాయికి చదువూ వస్తుంది. మరి కొన్నాళ్ళు పెళ్ళి ప్రసక్తి ఆగిపోతుంది.' అన్నది ఇందుమతి స్థిరమైన కంఠస్వరంతో.

'ఇది నా స్వార్థమని సుమిత్ర అనుకోదా?'

'బావుందండీ! ఎవరి స్వార్థం వాళ్ళు చూసుకోకపోతే బ్రతకడం ఎంత కష్టం! రఘుమాత్రం అతని స్వార్థం అతను చూసుకోలేదా? మనదీ పెద్ద సంసారం — నాలుగేళ్ళలో మన విశ్వం పెద్ద చదువులోకి వెళ్తాడు. సావిత్రి పెళ్ళికి ఎదుగుతుంది. ఇప్పుడే ఇల్లు కాస్తా అమ్ముకుంటే అప్పుడెలా తట్టుకుంటాం?' అన్నది ఇందుమతి నవ్వుతూ... ఆవిడ ముఖం చాలా నిర్మలంగా వుంది.

మగవాళ్ల ఆలోచనా విధానానికీ స్త్రీల ఆలోచనా పద్ధతికీ, చాలా తేడా వుందనుకున్నాడు మాధవరావు — భార్య చెప్పినదాంట్లో అంతా నిజమేగానీ అబద్ధం ఏమీ లేదు. విశ్వాన్ని ఇంజినీరింగ్ చదివించాలనే కోరిక యిప్పటిది కాదు. దానికి తగ్గట్టు వాడి కెప్పుడూ లెక్కల్లో ఫస్టు మార్కులే. సావిత్రికీ పన్నెండేళ్ళొచ్చాయి. ఇంకా నాలుగయిదేళ్ళల్లో దానికీ పెళ్ళిచెయ్యడమో చదివించడమో చెయ్యాలసిందే

'నువ్వు చెప్పిందే బావుంది ఇందూ!' అన్నాడు మాధవరావు చివరికి.

మెట్లమీద అడుగుల సవ్వడివిని వులిక్కిపడి చూసింది ఇందుమతి.

ఆ సమయంలో అక్కడికి వచ్చే ధైర్యం, చొరవా సుమిత్ర ఒక్కదానికే వున్నాయి.

'ఏమాలోచించారు వదినా?' అని అడగనే అడిగేసింది ఆ అమ్మాయి చివరి మెట్టుమీద నిలబడి.

'నీ ఉద్దేశ్యం అడక్కుండానే నిర్ణయిస్తామా?' అన్నది ఇందుమతి గడుసుగా నవ్వుతూ —

'నాకు చదువుకోవాలనే వుంది'

మిం అమ్మకలా చెప్పడం?' అన్నాడు మాధవరావు వెంటనే.

'రఘు అన్నయ్య పెళ్ళివార్త తెలిసి ఈ సంబంధం తప్పిపోయిందని చెబుదాం. ఇలాగే సంబంధాలు తప్పిపోతున్నాయని చెబుతానులే అన్నయ్యా! ఎలాగో అమ్మకి నచ్చ జెబుదాం. అలా చెప్పడంవల్ల వాడిమీద ప్రస్తుతంలో కోపం ఎక్కువ కావచ్చు. కానీ కాలక్రమేణా ఎలాగో సర్దిచెప్పుకుందాంలే అన్నయ్యా! నన్ను రెంటికీ చెడ్డ రేవడని చేయకండి—' సుమిత్ర కంఠంలో అర్థింపు మాధవరావు గుర్తించాడు.

'ఎలాగో చెయ్యవచ్చునులే. పదండి పోదాం? ఆవిడ ఒక్కరే ఏం చేస్తున్నారో!' అని క్రిందకి దారితీసింది ఇందుమతి.

'డబ్బు విషయం వాడికి నువ్వే వ్రాయి సుమిత్రా — నాకు వ్రాయాలనిపించడం లేదు—కాలేజీలు ఇంకా పదిరోజుల్లో తెరుస్తారు. అప్లికేషన్లు పెట్టుకోవాలికదా!' అన్నాడు మాధవరావు.

'నేనే వ్రాస్తానులే—' సుమిత్ర నిట్టూర్చింది. కొందరి జీవితం, మహాకవి చెప్పినట్లు వర్ధించిన విస్తరి. మరికొందరి జీవితం, అన్నీ వాళ్ళకివాళ్లే వెతుక్కుని సంపాదించుకుని వండుకుని, విస్తరి కుట్టుకుని వడ్డించుకోవాల్సిన జీవితం. అది బ్రతుకు తెరువుకోసం పెనుగులాట. జీవన సమరం.

క్రిందకి వచ్చి కాగితం తీసుకుని ఉత్తరం వ్రాయాలని కూర్చుంటే కళ్ళనిండా నీళ్ళొచ్చాయి చిన్నన్నయ్య అంటే చాలా యిష్టం. చిన్నవదినె ఎలా వుంటుందో! ఎంతో అందంగా వుండకపోతే నచ్చుతుందా! ఎంత సుగుణవతో! ఎంత సౌజన్యంకల వనితో! ఆవిడని చూడడం ఎప్పటికో! ఇందువదినె కొంచెం ప్రాక్టికల్‌గా మాట్లాడే మనిషి కనుక చాలా మందికి అదోకరకంగా కనిపిస్తుందిగానీ చాలా మంచిది. అమ్మ తరువాత అమ్మ అంతది. చిన్నన్నయ్యకి ఏం వ్రాయాలి? ఎలా వ్రాయాలి? ఎంతోసేపు ఆలోచించాక ఎలాగో నాలుగుమాటలు వ్రాసింది సుమిత్ర.

'నేను కాలేజీలో చేరాలని నిర్ణయించుకున్నాను నువ్వు అన్నప్రకారం నాకు డబ్బు పంపవలసింది. అమ్మ ఆరోగ్యం ఏం బాగాలేదు. బి. పి. బాగా వుంది. చిన్నవదినెకి నా శుభాకాంక్షలు. ఆవిడని చూడాలనివుంది.

సుమిత్ర.'

సంబంధం చిన్నన్నయ్య మూలంగా తప్పిపోయిందని అమ్మతో అనాలి కానీ, ఆమాట అతనికి వ్రాయడానికి అంతరాత్మ వొప్పుకోలేదు. నిజానికి సంబంధం పోయేది కట్నం డబ్బు లేకేగానీ అతనిమూలంగా కాదు—కానీ ఈ అబద్ధం ఆడక తప్పదు—బరువుగా నిట్టూర్చి ఉత్తరంమీద ఎడ్రెసు వ్రాసి మంచంమీద వాలిపోయింది సుమిత్ర. వారం తిరక్కముందే నాలుగువందల రూపాయలూ, ఓ ఉత్తరం వచ్చాయి సుమిత్రకి రఘుపతి దగ్గర్నుంచి.

'మొదట్లో పుస్తకాలు కొనుక్కోడానికీ, ఫీజు కట్టుకోడానికీ అని ఈ డబ్బు పంపుతున్నాను. అమ్మకి మంచి డాక్టర్ దగ్గర ట్రీట్‌మెంట్ యిప్పించండి. ఇక నుంచి నీ కోసం అమ్మకోసంగాను నెలకి ఎనభై రూపాయలు పంపుతాను. రాధని చూడాలని వుందన్నావు. తరుణం వచ్చినప్పుడు తప్పక చూడవచ్చు ఉత్తరాలు వ్రాస్తూవుండు' అని వ్రాశాడతను.

'వాడిడబ్బు అనుకోడం నాకిష్టంలేదు' వాడిడబ్బులో నువ్వు చదువుకొనక్కర్లేదు' అంటూ మొదట్లో అభ్యంతరాలు చెప్పింది అన్నపూర్ణమ్మగారు.

'ఆ డబ్బు అప్పుడే తిప్పి పంపేశానమ్మా! నేనసలు తీసుకోలేదు—పెద్దన్నయ్యే ఎక్కడో అప్పు చేసి తెచ్చిచ్చాడు—వాడే నన్ను చదివిస్తున్నాడు. నిజం' అని చెప్పింది సుమిత్ర గట్టిగా...

'ఎప్పుడూ వాడే నాకంటి వెలుగు—వాడే నా కొడుకు. వాడిదసలే పెద్ద సంసారం. ఇక నీకూడా ఎక్కడ చెప్పిస్తాడే చదువు—వాడి గుండెలమీద కుంపటైనావు గదుటే!' అని కళ్ళనీళ్ళు తుడుచుకుందావిడ.

ఎలాగైతేనేం కాలేజీలో సీటు సంపాదించుకుని క్రొత్తజీవితం ప్రారంభించింది సుమిత్ర చివరికి...

'చిన్నన్నయ్యా! ఇదంతా నీదయ—కానీ పైకి అనడానికి వీల్లేదు—నీ మీద అమ్మకి మరింత కోపం కలుగజేసి నీకు ద్రోహం చేస్తూ మళ్ళీ నీ సహాయంతనే పెద్దదాన్నౌతున్నాను. నన్ను క్షమించన్నయ్యా!' అనుకుంది సుమిత్ర.

(ఇంకా ఉంది)



# తాజ్ మహల్

మూలం :
పి. ఎన్. ఓక్

అనువాదం :
బలిజేపల్లి రాఘవరావు
ఆకుండి నారాయణమూర్తి

[ఈ వ్యాసంలోని అభిప్రాయాలు రచయితవి మాత్రమే అని పాఠకులు గమనించ కోరుతున్నాము. —సం॥]



తాజ్ మహల్ దృశ్యం. (బొమ్మలోనివారు హోల్యోక్ దంపతులు)

మధ్య యుగానికి చెందిన భారతీయ కట్టడాల గురించి పరిశోధన గావిస్తూ వుంటే మొట్ట మొదటి దోషం అకస్మాత్తుగా కంట బడింది

భారతదేశంలోగల ప్రసిద్ధ కట్టడాల నిర్మాణ చరిత్రను పరిశీలించబోయేముందు, వాటిని ముస్లిమ్ నిర్మాణాలుగా అంగీకరించిన చరిత్ర పరిశోధకుల అసమగ్ర పరిశోధనకు మనం ఎంతైనా విచారించాల్సుంది.

గత చారిత్రక పరిశోధకులు మహమ్మదీయ నిర్మాణాలుగా పేర్కొన్న కట్టడాలన్నీ యధార్థానికి హైందవ నిర్మాణాలే!. మధ్యయుగానికి చెందిన భారతీయ కట్టడాలపై ప్రముఖ చారిత్రక పరిశోధకుల మనస్సులలో యింతవరకూ గాఢంగా నాటుకొనివున్న చారిత్రకాభిప్రాయాలను యథాస్థితికి మళ్లించడానికి ఈ ప్రయత్నం ఎంతైనా ఉపకరిస్తుంది.

పూర్వం పూనాలోగల పుణ్యేశ్వర్, నారాయణేశ్వర్ దేవాలయాలు నేడు పెద్ద షెక్‌సాలా దర్గాస్, చిన్న షేక్‌సాలా దర్గాస్ (Sheik salla dargahs) అనే పేర్లతో పిలువబడుతున్నాయి. పూనా విశ్వ విద్యాలయ మాజీ వైస్ ఛాన్సెలరు, ప్రసిద్ధచారిత్రకపరిశోధకుడు అయిన మహామహోపాధ్యాయ దత్తోవామన్ పాట్‌డర్, 1963 డిసెంబరులో పూనాలో జరిగిన 'ఇండియన్ హిష్టరీ కాంగ్రెస్ సిల్వర్ జూబ్లీ' సమావేశంలో ఆహ్వాన సంఘాధ్యక్షుడిగా వుంటూ చేసిన ఉపన్యాసంలో ఈ వివరాలు వెల్లడించేరు.

మధ్య భారతదేశంలోగల థార్ అనేచోట 'కమాల్ మౌలా మసీదు' అని నేడు పిలవబడుతున్న మసీదు, పూర్వం ప్రసిద్ధ సంస్కృత నాటకాలను శిలా ఫలకాలమీద చెక్కించి భద్రపరచే 'సరస్వతీ కంఠాభరణము' అని నిరూపించబడింది. ఈ నగ్న సత్యాన్ని శాశ్వతంగా రూపుమాపాలని చేసిన ప్రయత్నాలన్నీ, యీ అద్భుత రహస్యం బహిర్గతమవడంతోనే చిన్నాభిన్నమయి పోయేయి.

ప్రసిద్ధ లింగ మహాలయం (గొప్ప శైవాలయం) ఇంకా ఓ మసీదుగానే ఉపయోగింపబడుతోంది. ఇది గుజరాత్‌రాష్ట్రంలోని సిద్ధపూర్‌లో ఉంది. వారణాశిలోని ప్రాచీన కాశీ విశ్వనాధ దేవాలయం ఇంకా ఒక మసిదుగానే ఉపయోగపడుతున్నది. భారతదేశం స్వాతంత్ర్యం పొందేటంతవరకూ సుప్రసిద్ధ సోమనాధ దేవాలయం కూడా ఒక మసీదుగానే ఉపయోగించ బడింది.

పాత ఢిల్లీలో డరీబా కలన్ (Dariba kalan) ప్రాంతంలో మసీదు అని పిలవబడే భవన ప్రాంగణపు పునాదిలో అసంఖ్యాకమైన హైందవ దేవతా విగ్రహాలు పాతిపెట్టబడినట్లు దేశ విభజన సమయంలో జరిగిన మత కల్లోలాల్లో బహిర్గతమయింది

అజ్మీర్‌లోగల అధయ్—దిన్—కా—ఝోప్డా అనేది విగ్రహరాజ్— విశాల దేవుని విద్యాలయంలోని ఒక భాగమని విశ్వమంతా అంగీకరించింది.

ఢిల్లీలో 'కుతుబ్‌మీనార్' అని వ్యవహరింప బడుతున్న కట్టడం, కుతుబుద్దీన్‌నకు చాలా

# ముస్లిమ్ నిర్మాణంగా ఖ్యాతి గాంచిన భారతీయ కట్టడం!

పూర్వమే వున్న ఓ హిందూ నిర్మిత గోపురమని నేడు ఎంతోమంది అంగీకరిస్తున్నారు!

ఆలీఘర్ ముస్లిమ్ యూనివర్శిటీ సంస్థాపకుడు, ముస్లిమ్‌లీగ్ నిర్మాత అయిన సర్ సయ్యద్ అహమ్మద్ గారే, కుతుబ్‌మీనారు, దాన్ని ఆనుకొని వున్న దేవాలయం ప్రాచీన హైందవ నిర్మాణాలనే నేటి వాదనను అంగీకరించినారు.

నేడు భారతదేశంలోగల మధ్య యుగపు అనేక కట్టడాలు నిజానికి హిందువులచే నిర్మింపబడినవే! కాని అవన్నీ మహమ్మదీయులచే నిర్మించబడిన కట్టడాలుగా ప్రచారాన్ని పొందేయి! ఇటువంటి కట్టడాల జాబితాను తయారుచేస్తే—అవి కొన్ని వేలుంటాయేమోనని నా విశ్వాసం. ఈ విశ్వాసంతోనే మహమ్మదీయ పరిపాలకులచే నిర్మింపబడినట్లు చెప్పబడుతున్న కట్టడాల నిర్మాణ రహస్యాల పరిశోధనకు పూనుకున్నాను నా రీగా పరిశోధనలో ఆయా కట్టడాలన్నీ హైందవ నిర్మాణాలేనని అంగీకరింపచెయ్యడానికి కావలసిన సాక్ష్యాధారాలెన్నో అత్యాశ్చర్యకరంగా బయట పడ్డాయి!

తాజమహల్‌ను షాజహాన్ నిర్మించేడనే ప్రస్తుతపువాదం సరి అయినది కాదు. అయితే ఈ సందర్భంలో మనం మూడు ముఖ్యమైన విషయాలను గురించి చర్చిద్దాము

1. తాజమహల్‌యొక్క మధ్యగదిలో పూర్తిగా మహమ్మదీయపద్ధతిలో నిర్మించబడిన రెండు గోరీలు కనిపిస్తాయి వాటిలో ఒకటి షాజహాన్‌ది; రెండవది అతనికిగల అసంఖ్యాకమైన భార్యలలో ఒకతె అయిన ముంతాజ్ మహల్‌ది. ఈ విషయాన్ని అంగీకరిస్తూనే మనం మనయొక్క వాదనాంశాలను వివరిద్దాము. ఈ రకమైన సమాధులన్నీ అసంబద్ధమైన నిర్మాణాలే!...మృతకళేబరాన్ని ఖననం చెయ్యడానికి ఎట్టి అవకాశమూలేని కొన్ని చారిత్రాత్మకమైన భవనాలపైన, డాబాలపైన మాత్రం యిలాంటి గోపురాలు నిర్మితమై యుంటాయి ముంతాజ్‌ని ఖననం చేసిన తేదీ ఖచ్చితంగా తెలియకపోవడంచేత, అసలు నిజంగా ముంతాజ్ తాజ్‌లో ఖననం చేయబడిందా అనే అనుమానం కలుగుతున్నాది. ఆమె మృతకళేబరాన్ని ఖననం చేసిన తేదీ, ఆమె మరణించిన తరువాత ఆరునెలల నుండి తొమ్మిదేళ్లలోపున జరిగివుంటుంది. ఆమె మృతకళేబరంకొరకు అంతటి దివ్య భవనాన్ని నిర్మించేరనడం కూడా నమ్మశక్యంకాని విషయం. ఔరంగజేబుకాలంలో వచ్చిన తూర్పిండియాసంఘపు ఆఫీసరు మనుచి అక్బర్‌సమాధి కాళీభవనమని, దానిలో ఏమీ లేదని అనేసేడు. అంచేత ముంతాజ్ సమాధిగా చెప్పబడుతున్నది కూడా తత్తుల్యమైనదే ఎందుకుకాకూడదు? ఈరకంగా ఎన్నో ఆధారాలున్నా మనం మాత్రం ఆరెండు సమాధులు ముంతాజ్, షాజహానుల సమాధులని చేయబడుతున్న ప్రచారమంతా యదార్థమైనదనే ఎంతో అమాయకంగా నమ్ముతున్నాము.

2. ఈ గోరీలపైన, వెలుపలగల ఆర్చీలపైన ఖురాన్‌సూక్తులు చెక్కబడి వుండడంచేత యిది షాజహాన్ నిర్మాణమేనన్న ప్రసిద్ధగాథ ప్రచారంలో వుంది కాని ఈ విషయానికి వ్యతిరేకంలో బలమైన సాక్ష్యాధారాలుగల వాదనొకటి మనకుంది. ఆవిధమైన సూక్తులు ఆజ్మీర్‌లోగల 'అథయ్‌దిన్‌కాజొహ్పా' వెలుపలిభాగాన, ఢిల్లీలోని కుతుబ్‌మీనార్ పైనకూడా వున్నాయి. ఆయాకట్టడాలు తమ స్వంతనిర్మాణాలే అని ప్రచారం చేసుకొనేటందుకు ముస్లిమ్ పరిపాలకులు బుద్ధిపూర్వకంగా సృష్టించిన వ్రాతలవన్నీని అంచేత తాజ్ మహల్‌లోని గోరీలపైన, వెలుపల ఆర్చీలపైనవున్న ఖురాన్‌సూక్తులు అట్టి వ్రాతలనే మన మనుమానించవచ్చు

3. తాజమహల్ షాజహానే నిర్మించేడని బుజువుచెయ్యడానికి వారు చూపే మూడవ ఆధారమేమిటంటే అబ్దుల్ హమీదొలాహొరి అనే ముల్లాచే వ్రాయబడిన జీవితచరిత్రలో దీని నిర్మాతగా షాజహాన్‌ని పేర్కొన్నాడన్నది. ఈ వాదనకు వ్యతిరేకంగా మనవాదన చాలా ఉన్నది. క్రూరాత్ములైన ప్రభువుల సన్నిధిలో సుఖజీవనంచెయ్యడంకోసం వారిని పొగడుతూ వారికి ఉల్లాసాన్ని కలిగిస్తూవుండే వారి కోవకు చెందిన ముల్లా అబ్దుల్‌హమీద్ వంటి వారి వ్రాతలు కేవలం వారి వ్యక్తిగత లాభలకోసం వ్రాసినవే! ... తాజ్ మహల్ని తాను నిర్మించినట్లు వర్ణిస్తూ ఒక గ్రంథాన్ని వ్రాయమని షాజహాన్ ముల్లా అబ్దుల్‌హమీద్‌ను ఆజ్ఞాపించినట్లు లిఖిత పూర్వకమైన సాక్ష్యాధారాలు మనకున్నాయి. అతని తండ్రి జహంగీర్ మరణించిన మూడు సంవత్సరముల తరువాత జహంగీరు నామాను మార్పించి, ఒక్క అసంబద్ధపు ప్రతిని మాత్రమేవుంచిన చర్యవల్ల షాజహానుకు లిఖిత పూర్వక దాఖలాలను మార్చివేసే అలవాటుందని స్పష్టపడుతున్నది. అంతేకాక తాజ్ సంరక్షకులు భద్రపరచిన 'తారీఖ్—యి-తాజ్‌మహల్' అనేదికూడా కేవలం దొంగపత్రమేనని 'కీని' ధృవపరచేడు అంతేకాక అబ్దుల్ హమీద్ రచనలలో కేవలం పనికిమాలిన విషయాలెన్నో వున్నట్లు అందులోగల విషయాలే వెల్లడిస్తున్నాయి!...ఆ భవన నిర్మాణ ప్రణాళికా రచయిత ఎవరో అతడు తెలుపకపోవడంవల్ల ప్రస్తుత చరిత్ర పరిశోధకుల అనుమానాలకు మరింత దోహదం చేకూరింది. తాజ్‌మహల్ నిర్మాణానికి ఏభైలక్షల రూపాయలు ఖర్చయ్యాయని ముల్లా అబ్దుల్‌హమీద్ పేర్కొనడం చరిత్ర విద్యార్థులకు హాస్యాస్పదమనిపించింది. ఇలాంటి అసంబద్ధమైన సంగతులెన్నో ముల్లా అబ్దుల్‌హమీద్ రచనలలో కానవస్తాయి. ప్రజల్ని మోసగించడానికి చేసే కల్పితగాథలలో ఎన్నో అసందర్భాలుంటాయన్న వాదనకి యిదొక నిదర్శనంగా ఉంటుంది!

తాజమహల్‌ని షాజహానే నిర్మించేడన్న వారి వాదనలో అసమగ్రత్వాన్ని పైమూడు విషయాలలోను మనం గ్రహించవచ్చు. ఇకపోతే నా వాదనకుగల ఆధారాలు ఈ క్రిందన పొందుపరుస్తున్నాను.

1. చరిత్రలో స్వర్ణయుగంగా పేర్కొనబడిన షాజహాన్‌కాలంలో తాజమహల్ నిర్మాణానికి సంబంధించిన లిఖిత పత్రం ఒక్కటైనా లభించడం లేదు. తాజ్‌మహల్ నిర్మాణానికి సంబంధించిన ఆజ్ఞాపత్రంగాని, ఆ భవన నిర్మాణానికి వలయు స్థలాన్ని ఆక్రమించినట్టు, లేదా కొన్నట్టు గాని ఎక్కడా లిఖితపూర్వక పత్రాలు లేవు. అంతేకాక దాని ప్లానుగాని, ఖర్చువెచ్చాలు గల పత్రాలుగాని, రసీదులుగాని ఏవీ లభ్యమవలేదు

# తాజ్ మహల్

1. తాజమహల్ అనే పేరునుబట్టి అదొక రాజవంశీయుల నివాస భవనము లేక ఉత్తమ నివాసభవనమని సుస్పష్టమవుతున్నది. మృత కళేబరాన్ని ఖననంచేసే శ్మశానస్థలానికి నివాసభవనమనే పేరెలా వచ్చిందో తెలీకుండా వుంది! ... కాని నివాస భవనాన్ని సమాధిగా మారుస్తే దానికాపేరు స్థిరపడడానికి అవకాశముంది.

3. నిజంగా తనే తాజమహల్‌ని నిర్మిస్తే, ముల్లా అబ్దుల్ హమీద్‌చే వ్రాయించిన చరిత్రలో తనే తాజమహల్ నిర్మాతన్న విషయం పేర్కొనడం మరచి పోవద్దని ప్రత్యేకంగా కోరవలసిన అవసరం షాజహానుకు లేదు ఒక వేళ షాజహానే ఆ మహాద్భుతమైన భవనాన్ని నిర్మించుకున్నట్లయితే దాన్ని తనే నిర్మించినట్లు చరిత్రలో పేర్కొనమని అబ్దుల్ హమీద్ వంటి స్తోత్రపాఠకుణ్ణి ప్రత్యేకంగా కోరవలసిన అవసరమే లేదు!—దాన్ని అతను నిర్మించలేదు గనుకనే యిలా ప్రత్యేకంగా కోరవలసిన అవసరమేర్పడింది షాజహానుకి.

4. తాజమహల్ నిర్మాణ ప్రణాళికను తయారుచేసిన శిల్పిపేరు లేకపోవడం, దాని నిర్మాణపుఖర్చును అంత తక్కువగా ఊహించడంవంటి ముఖ్యమైన దోషాలుండడం వల్ల సమకాలీన చరిత్రకారుల అవహేళనకది గురయింది.

5. అంతేకాక మిగిలిన అంచనాలు కూడా 50 లక్షలని, 9 కోట్ల 17 లక్షలని యిలా చాలా వ్యత్యాసంతో ఉన్నాయి.

6. తిరుగుబాట్లతో, కల్లోలాలతో అంటు వ్యాధులతో, కరువు కాటకాలతో అంతులేని యుద్ధాలతో నిండిన షాజహాన్ పరిపాలనాకాలాన్ని స్వర్ణయుగం అనడం అవివేకం.

7. షాజహాన్‌యొక్క దురహంకారత్వం, విషపూరిత స్వార్థపరత్వ మనస్తత్వం తెలిసిన వారెవరూ, అకడొక మరణించిన వ్యక్తి శరీరంమీద ఎంతో ధనం వెచ్చించి అటువంటి మహాద్భుతమైన భవనం నిర్మించేడంటే నమ్మలేరు

8. అటువంటి మహాద్భుతమైన భవనం నిర్మించాలనే భావన, అప్పు డతడున్న పరిస్థితినిబట్టి అతనికి కలలో కూడా వచ్చివుండదని భావించవచ్చు. మార్చివేయబడిన లెక్కలవల్ల తప్పుడు వ్రాతలవల్ల — అతడు పనివారికి కూలి డబ్బులివ్వక కేవలం కొలబత్తెములిచ్చి పని చేయించినట్టు తెలుస్తున్నది. ఇంకొక ఆధారంవల్ల అతడు రాజులనుండి, మహారాజులనుండి పెద్ద పెద్ద మొత్తాలు వసూలుచేసినట్లు తెలుస్తున్నాది. అంటే యిలా వసూలుచేసిన డబ్బుని ఈ భవనాన్ని ఒక మసీదుగా మార్చడానికి మాత్రమే వినియోగించుంటాడు అని మనం భావించాలి! కూలీలకు కూలి డబ్బులివ్వక, చాలీచాలని తిండిపెట్టి వాళ్లచే ఆ భవనాన్ని ఓ మసీదుగా మార్పించేడు.

9. తాజమహల్ వంటి గొప్ప విలువైన దివ్యభవనాన్ని కేవలం సమాధికోసమే నిర్మించున్నట్లయితే—అందులో ఆ శవం ఖననం చేయబడిన తేదీ, ఆనాడు మహావైభవంగా జరిగిన కర్మకాండ వివరాలు రాజపత్రాలలో లిఖించబడుండేవి! ... అటువంటివేవీ లిఖించబడలేదు. ఖననం చేయబడిన తేదీ వ్రాయకపోడం ఒక్కటే గాక, తాజ్‌లో ముంతాజ్ భౌతికకాయం ఖననం చేయబడిందని భావించబడుతున్న తేదీకి ముంతాజ్ మరణదినానికి సుమారు ఆరుమాసాలనుండి, తొమ్మిది సంవత్సరాల వరకూ తేడా కనిపిస్తున్నాది.

10. షాజహాన్‌కాలంలో, రాజకుటుంబీకులైనా, సాధారణ కుటుంబీకులైనా పిల్లలకు ఇరవయ్యో సంవత్సరం నిండకముందే వివాహాలు చెయ్యడం ఆచారంగా వుండేది. అందుచేత షాజహాను ముంతాజ్‌ని వివాహ మాడే నాటికి ఆమెవయస్సు యిరవై ఏళ్లలోపే వుంటుంది! అసంఖ్యాకంగా గల అతని భార్యలలో యింత చిన్న వయస్సులో వివాహమాడిన ముంతాజ్‌కి స్మృతి చిహ్నంగా యిలాంటి దివ్యభవనాన్ని నిర్మించడానికి గల కారణం అంతుబట్టకుండా వుంది.

11. జన్మతః అతి సామాన్యురాలైన ముంతాజ్‌కి మరణానంతరం అంత గొప్ప విలువైన స్మృతి చిహ్నాన్ని పొందే అర్హత లేదు.

12. జహంగీర్, నూర్జహాన్‌ల ప్రణయాన్ని గురించి వ్రాసినంత అధికంగా షాజహాన్, ముంతాజ్‌ల ప్రణయాన్నిగురించి చరిత్రకారులు వ్రాయలేదు. వారి సన్నిహితత్వం గురించిగాని శృంగారకేళీ వినోదాలను గురించిగాని చిత్రకారులు ఎక్కడా లిఖించలేదు. ముంతాజ్, షాజహానులకు మధ్యగల ప్రణయగాథ ఈ మధ్యనే ఈ భవనం ముంతాజ్‌కి స్మృతిచిహ్నంగా నిర్మించేడన్న వాదనకు ఆలంబనగా ప్రచారం చెయ్యబడిందని భావించవచ్చు.

13. షాజహాన్ కళాభిమాని కాడు. నిజంగా అతడు కళాభిమానే అయుంటే తన భార్యకోసం స్మృతిచిహ్నం నిర్మించడంలో కష్టపడుతున్న కళాకారుల చేతులు తెగనరికి వారిని మొండివారిగా చేసుండేవాడు కాదు. ఒక కళాభిమాని, అందునా భార్యావియోగ దుఃఖంలో కుమిలిపోతున్నవాడు— ఒక ప్రజ్ఞావంతుడైన కళాకారుని చేతులు నరకడంవంటి ఉన్మత్త పైశాచిక కార్యకలాపాన్ని సాగించడు!... షాజహాన్ కొంతమంది కళాకారుల్ని వికలాంగుల్ని చేసినకథ నిజమేననిపిస్తోంది. కారణమేమిటంటే — చాలీచాలని తిండిపెట్టి కూలిడబ్బులుకూడా యివ్వక నిర్దాక్షిణ్యంగా హింసిస్తూ—తనభార్య మృతకళేబరానికి సమాధిగా ఒక దివ్యభవనాన్ని మార్చమని ఆదేశిస్తే ఆ శిల్పులు తిరుగుబాటు చెయ్యడంలో ఆశ్చర్యమేమీ లేదు.

14 అత్యవసర పరిస్థితులలో తప్పించుకొని పారిపోవడానికి వీలుకలిగించే సొరంగమార్గమొకటి తాజమహల్‌లోవుంది. మృతకళేబరసమాధి రక్షణార్థం భూసొరంగ మార్గంగాని, మరొక రహస్య మార్గంగాని వుండ నవసరంలేదు. అత్యవసర పరిస్థితిలో శత్రువుల కంటపడకుండా అతిరహస్యంగా తప్పించుకొని పారిపోయేటందుకు వీలుగా యిలాంటి రహస్య సొరంగ మార్గాలు నివాస రాజభవనాలకు మాత్రమే వుంటాయి. అంతేకాని సమాధులకుండవు.

15 ఈ భవనానికి ముందున్న నీటి దాపుకు దిగే మెట్లుకూడా యిదొక నివాసభవనమేనని రూఢి పరుస్తున్నాయి.

16 ఈ భవనానికి మధ్యలోగల చలువ రాతి నిర్మాణంకూడా 25 గదులు గలిగి పాలరాతితో వాసయోగ్యంగా నిర్మించబడి వుందిగాని సమాధికోసం నిర్మించినట్టుగా

లేదు.

17. దిగువను, గోపురాలలోను, పై అంతస్థులలోను గల నడవలు, గదులు అన్నీ కలిపి ఈ భవనంలో మొత్తం 300 గదులు వున్నాయి. సమాధికి యిన్ని గదులుండాల్సిన అవశ్యకతేమిటో అవగత మవలేదు !

18 దీనిలోగల అతిథుల విలాస మందిరాలు, రక్షకభటుల నివాసగదులు, విశ్రాంతిమందిరాలు యివన్నీకూడా యిదొక నివాసభవనమనే సత్యాన్ని నిరూపిస్తున్నప్పటికి, ఈ భవనంవద్ద నున్న శిలా ఫలకంపై ఈ సత్యాలేవీ వివరించబడలేదు.

19 ఇందులోగల విలాస గోపురాలను బట్టి యిదొక నివాసభవనమని రూఢి పర్చవచ్చు. స్మశానానికి, మరోపేరయిన సమాధిలో ఈ రకమైన గోపురాలు ఒకభాగం ఎన్నటికి కాలేవు !

20. కలాస, బాసాయ్ (గోపురం) అనేవి శుద్ధ సంస్కృత పదాలు ఈ భవనం షాజహానుచే స్వయంగా ఓ సమాధి అనే దృష్టితోనే నిర్మితమై యున్నట్లయితే ఈ పదాలకి భవనంలో తావుండేది కాదు అది ఓ సమాధిగా మార్చబడకముందే ఆ పదాలు ఈ భవనం చెక్కబడి వాయ వడం నిర్వివాదాంశం !

21. అలంకరణ శిల్పాలు పూర్తిగా భారతీయ శైలిలో చెక్కబడడమేగాక, హిందూ ధర్మానుష్ఠానాన్ని సూచించే వికసితపద్మంవంటి శిల్పాలెన్నో ఉన్నాయి. మహమ్మదీయమతం ద్వేషించే ఈరకమైన శిల్పాలుగల భవనంలో ఖననం చేయబడిన ముంతాజ్‌కి ఆత్మశాంతి చేకూరే అవకాశ ముందా అని ?

22 గేలరీలు, ఆర్చీలు, అలంబన స్థానాలు అన్నీకూడా పూర్తిగా హైందవ పద్ధతులో — రాజపుత్రస్థాన మంతటా కనిపించే భవన నిర్మాణపద్ధతులను పోలి వున్నాయి

23 మిగిలిన విషయాలవలెనే తాజ మహల్ నిర్మాణ కాలపరిమితిపై కూడా భేదాభిప్రాయాలున్నాయి 10, 12 13, 17 లేక 22 సంవత్సరాలకాలం దీని నిర్మాణానికి పట్టినట్లు కొందరు భావిస్తున్నారు ఈ కాలపరిమితిపై ఏకీభావం లేదు. దీనిబట్టి షాజహానే దీనిని నిర్మించే

# తాజ్ మహల్

డనేది అతి చాకచక్యంతో ప్రచారం చెయ్యబడిన ఓ కట్టుకథ అని రూఢి అవుతున్నది. ఒకవిధంగా ఆలోచిస్తే పైన చెప్పిన కాలపరిమితులు కూడా యథార్థమైనవే అనుకోవచ్చు. ఆ భవనాన్ని ఓ సమాధిగా మార్చడానికి కొన్నిమార్పులు 10 సంవత్సరాలలోను, మరికొన్ని మార్పులు మరికొంత కాలానికి ఇలా వేర్వేరుమార్పులు వేర్వేరు కాలపరిమితులలో పూర్తిచేయబడ్డాయి. ఇవన్నీ తాజ మహల్ ఒక హిందూ రాజపుత్ర నిర్మిత భవనమే అనే విషయాన్ని రూఢిపరుస్తున్నాయి.

24 తాజమహల్ నిర్మాణ ప్రారంభాన్ని, అంత్యదశనకూడా చూసేనని వ్రాసిన 'తావెనీర్' వ్రాతలు — తాజమహల్ని షాజహానే నిర్మించేడనేవారి వాదనను బలహీనపరచి, నాంగా వాదనకు మరింత బలాన్ని చేకూరుస్తున్నాయి !... ఎందుచేతనంటే తావెనీర్ మందేశానికి 1641వ సంవత్సరంలో అంటె ముంతాజ్ మరణించిన 11 సంవత్సరాల తరువాత వచ్చేడు వారి వాదనను త్రోసిపుచ్చడానికి తావెనీర్ వ్రాసిన విషయాలు మనకి నాలుగువిధాల బలాన్ని చేకూర్చేయి జయసింగ్ యొక్క పూర్వులు నిర్మించిన ఈ భవనాన్ని ముంతాజ్ భౌతికకాయం ఖననం చెయ్యడంకోసం అతనివద్ద నుండి షాజహాన్ స్వాధీనం చేసుకున్నాడని మన వాదన!...ముంతాజ్ యిందులో ఖననం చేయబడిన పదకొండు సంవత్సరాల అనంతరం తావెనీర్ మనదేశం రావడం వల్ల అతడీ భవనాన్ని 'ముంతాజ్ సమాధి'గా పేర్కొన్నాడు అంతేకాక తన సముఖంలో 1641 నుండి 1668 వరకూ — ఒక పరంజాని నిర్మించి దానిపై నుండి ఖురాన్ సూక్తులను ఆ భవనంపై చెక్కుతూ వుండడాన్ని చూసి అతడీ భవన నిర్మాణ ప్రారంభదశను ముగింపుదశను చూసేనని వ్రాసేడు అంతేకాక ఆ కాల వ్యవధిలో దానినొక అందమైన సమాధిగా మార్పు చెయ్యడానికి కొన్ని మార్పులను చేసి వుండవచ్చు!... ఈ తతంగమంతా చూసి ఆను దాని నిర్మాణ ప్రారంభదశను, ముగింపుదశను చూసినట్లు భ్రమిచేడు. ఈ సందర్భంలో మనం తవెనీర్ వ్రాతలకు విశిష్టమైన ప్రాముఖ్యత నివ్వక తప్పదు.

25 షాజహాన్ పెద్ద పెద్ద మొత్తాలను రాజుల వద్దనుండి, మహారాజుల వద్ద నుండి వసూలుచేసి ఈ ప్రసిద్ధ నిర్మాణాన్ని 10, 12, 13, 17 లేదా 22 సంవత్సరాల కాలం నిర్మించేడంటే మనం నమ్మవచ్చు ఇది మన వాదనకు మంచి బలాన్ని చేకూరుస్తుంది. ఆయా సంవత్సరాలలో ఆ భవనాన్ని ఒక సమాధిగా మార్చడానికి షాజహాన్ కొన్ని మార్పులను చేసుంటాడు !.. షాజహాన్ తన స్వంత ఖజానానుండి ఏమీ ఖర్చు చెయ్యడానికి అంగీకరించక, తన సామంతుల్ని ప్రజల్ని పీడించి బలవంతంగా డబ్బుగుంజి, మరణించిన తన భార్యపేరున కూడా ఆర్థికంగా, రాజకీయంగా ఎంత లాభం పొందేడో ఈ విషయం ధృవపరుస్తున్నది. ఒకపంక రాజులను మహారాజులను బలవంతం చేసి - వారి రక్తబంధువు వద్దనుంచి ఆక్రమించిన దివ్య భవనాన్ని మసీదుగా మార్చేటందుకు కావలసిన పెట్టుబడిని సంపాదించడమేకాక — ఈ మార్పిడి కార్యక్రమాన్ని చేబట్టిన కార్మికులకు, కళాకారులకు జీతాలివ్వక, చాలీచాలని తిండిపెట్టి వెట్టిచాకిరీ చేయించేడు. అంచేతనే ఈ కార్యక్రమం ఇన్నేళ్లపాటు నత్తనడకలా తప్పీగా సాగింది

26 ఈ భవన నిర్మాణ ప్రణాళికా రచయితలు, శిల్పులు అంతా ఆంగ్లేయులేనని ఆంగ్లేయులు — మహమ్మదీయులేనని ముస్లిములు చెప్పుకుంటూ వుంటే, ఇంపీరియల్ లైబ్రరీలో దీని నిర్మాణానికి సంబంధించిన ఒక లిఖిత ప్రతిలో దీని శిల్పుల పేర్లన్నీ హిందూ మతస్థులనే వున్నాయి తాజమహల్‌ని షాజహానే నిర్మించేడని చాటిచెప్పే ఈ బూజుపట్టిన సిద్ధాంతం శుద్ధ అబద్ధమని చెప్పడానికి యింతకంటే ఘనమైన నిదర్శనం యింకేంవి కావాలి?

27. ఇంపీరియల్ లైబ్రరీలో వున్న వ్రాతప్రతిలో అన్నీ హిందువులపేర్లే వుటూవుండగా— ఈ భవనాన్ని నిర్మించిన శిల్పులు ఆంగ్లేయులేనని వాదించే ఆంగ్లేయులలోను, మహమ్మదీయులేనని

వాదించే ముస్లిములలోను భేదాభిప్రాయాలు గల రెండు తెగలవారున్నారు. దీనివల్ల పాశ్చాత్యులలో కూడ దీని నిర్మాణ విషయంలో భేదాభిప్రాయాలున్నాయని స్పష్ట పడుతున్నది ఒక తెగవారు ఈ భవన ప్రధానశిల్పి 'గెరోనిమోవెరోనియో' అనే ఇటలీ దేశస్థుడని తెల్పుతూ వుంటే, రెండవ తెగవారు 'అస్టియన్ బోర్డెక్' (Austian bourdeauk) అనే ఫ్రాన్సు దేశస్థుడని వాదిస్తున్నారు. ఇక మహమ్మదీయులలో కూడా యిటువంటి భేదాభిప్రాయాలున్నాయి. ఒక తెగవారు దీని ప్రధాన శిల్పి 'ఎస్సా ఎఫెండి' (Essa Effendi) అనే టర్కీ దేశస్థుడని చెపితే యింకొక తెగవారు అతనొక పర్షియన్ శిల్పి అని ఘనంగా శ్లాఘిస్తున్నారు ఇంతకీ ఈ 'ఎస్సా ఎఫెండి' అనేపేరు కేవలం యూహాలావంగా రచయితలుదహరించిన కల్పిత నామమేగాని, అతనే జాతీయుడో స్పష్టంగా ఎవ్వరికీ తెలీదు

28. ఈ సమాధి నిర్మాణానికగను షాజహానుకి స్వంత ఖజానానుంచి ఏనీ ఖర్చు కాకపోగా యిది అతనికి బంగారపు గుడ్లుపెట్టే బాతులా దొరికింది తాజమహల్‌లో మణిమాణిక్యాలు పొదిగిన చలువరాతిగోడలు, బంగారు కడ్డీలు, వెండి తలుపులుగల ద్వారాలు వున్నాయన్న కథ ప్రచారంలో ఉన్నది షాజహాన్‌గాని, అతని భార్య ముంతాజ్‌గాని బ్రతికి వున్న కాలంలో వారిలో ఏ ఒక్కరు నివసించిన భవనమూ కూడా పైన పేర్కొన్న వైభోగాల్ని కలిగి వుండలేదు. ముంతాజ్ చనిపోయిన వెంటనే కలలో కూడా ఊహించలేనంతటి స్వర్గధామంవంటి భవనం ఎలా సృష్టింపబడిందా అని?...అయితే వారు వర్ణించిన వాటిలో కొంతవరకూ నిజం వుండవచ్చు! వాటిని మనం కొంతవరకూ విశ్వసించ వచ్చు, వాటివల్ల షాజహాను ఎంత స్వార్థపరుడో అవగత మవుతున్నది చనిపోయిన తన భార్యపేరునుపయోగించి ఎంత ధనం అతను ప్రోవుచేసినదీ, యిందువల్ల మనం గ్రహించవచ్చు ఈ విషాద సంఘటనను సాకుగా తీసుకొని అతడు జయసింగుని, అతని తాత ముత్తాతల నివాస భవనం నుంచి వెడల నడిపేడు. పిమ్మట ఆ భవనంలోని సకల సంపదలను కొల్లగొట్టి తన ధనాగారానికి చేర్చేడు. ఆ తరువాత ఆ ఖాళీ విశాలభవనంలో ముంతాజ్ మృతకళేబరాన్ని ఖననం చేసేడు. ఈ భవనం నుండి తరలించుకుపోయిన ప్రకాశవంతమైన మణిమాణిక్యాదులే గాక రాజపుత్రుల నెమలిసింహాసనం కూడా ముఖ్యాకర్షణీయవస్తువయింది. నెమలి సింహాసనం యిలా వశపరచుకున్నదే కాకపోతే రత్నాలు పొదిగిన చలువరాతి తెరల నడుమను బంగారు గజాలు, వెండితలుపులుగల ప్రదేశంలో ప్రదర్శింప పనిరేదు. ఇరాన్‌నకు తరలించబడిన ఈ నెమలిసింహాసనం మొగలులు నిర్మించిన వస్తువులలోనిది మాత్రం కాదు!—అతిపురాతన హిందూ క్షత్రియుల పవిత్ర సింహాసన మిది. ఇది నాల్గవ శతాబ్దిలోని అనంగపాలునికిగాని, విక్రమ శకాన్ని (57 B. C.) ప్రారంభించిన విక్రమాదిత్యునకు గాని సంబంధించినదై యుండవచ్చు.

29 ప్రస్తుతం తాజమహల్ వున్న భవనం ఒకప్పుడు జయసింగు పురము, క్షాపెస్పురము అని ప్రసిద్ధిపొందిన జంట నగరాలు తాజమహల్ ఆ రెండు నగరాలకు నడుమ ముఖ్య కేంద్రస్థలంలో వుంది. 'పురము' అనే సంస్కృతపదానికి జన సమ్మర్దంతో నిండిన పట్టణమనే అర్థముంది. కాని ఖాళీస్థలమనే అర్థం లేదు.

30 తాజమహల్ని దాని ఆస్తితో పాటు, జయసింగువద్దనుండి బలవంతంగా షాజహాన్ వశపరచుకున్నాడన్న వివరణ ఈ వాదనకు మరింత బలం చేకూర్చింది. షాజహాన్ సహధికారకై ఒక ఖాళీ జాగాను మాత్రం వశపరచుకున్నాడని, నిర్మితమైన ఒక భవనాన్ని మాత్రం వశపరచుకోలేదని ఒక వాదన వుంది కాని దీనికి యితరత్రా ఏ ఆధారమూలేదు. అందుచేత ఈ రకమైన భావన అసమంజసమైంది.

31. తాజమహల్ని ఆవరించి వున్న ఎర్రనిరంగుగల ప్రహరీగోడకు వెలుపల దీని ననుసరించి అనేక చిన్నచిన్న కట్టడాలున్నాయి ఇవన్నీ ఆ భవనాలకు సన్నిహితులైనవారికి, సభికులకు ఉద్దేశించి కట్టబడినవి.

32 తాజ్‌ని ఆవరించి బ్రహ్మాండమైన తోటవుంది. ఇది నిజంగా ఓ సమాధి అనే ఉద్దేశ్యంతోనే నిర్మించబడినదై యున్నట్లయితే, దీని చుట్టూ ఫల వృక్షాలు, పరిమళాలు వెదజల్లే పూల మొక్కలు నాటబడవు. కారణ మేమిటంటే మరణించినవారికి పళ్లు, పువ్వులు ఇలాంటి వేవీ అవసరంలేదు!—ఇట్టి స్నిగ్ధ సౌందర్యంగల తోట కేవలం ఒక నివాసభవనాన్ని అనుకొని వుండవలసినదే! అంతే కాక ఈ తోటలోగల వృక్షజాతులన్నింటికి సంస్కృతపు పేర్లే వున్నాయి. కేతకి, జయ, చంపక, మౌలశ్రీ హరశ్రీనగర యిత్యాదివన్నీ సంస్కృతపదాలే.

33. బాబరు ఆగ్రాలోని తన ఉద్యానవన భవనంలో మరణించినట్లు వ్రాయ



బడింది. మనోహరమైన ఉద్యానవనంతో శోభిల్లే దివ్యభవనం ఆగ్రాలో తాజమహల్ ఒక్కటే. షాజహాను కు నాలుగుతరాలముందు చనిపోయిన బాబరు ఆగ్రాలోని ఈ తాజ మహల్ ఉద్యానవనంలోనే చనిపోయివుంటా డేమోననే అనుమానం యిందువల్ల కలుగు తున్నాది.

34. అక్బరు తన పరిపాలనా ప్రారంభ కాలంలో ఆగ్రా వెళ్ళినప్పుడెల్లా క్వాస స్ఫురం, జయసింగు పురాలలోగల దివ్యబవన మైన తాజమహల్‌లో బస చేసేవాడని స్పష్టపడింది. అతడా దివ్యభవనంలో స్థిరనివాసమేర్పరచుకోలేక పోవడానికి కార ణం; దాని రక్షణకవచం వంటిగోడ, ఇంకా దాన్ని వశపరచుకోడానికి చేసిన ప్రయత్నా లేవీ ఫలించకపోవడమూ అని అనుకో వచ్చు. అక్బరు తన కుమారుడు చేసే దుష్కృత్యాలను, తన అనుచరులలోని కొందరి మోసప్రవృత్తిని గమనించి అటు వంటిదివ్యభవనంలో ఉండడానికి సంశ యించుండవచ్చు!

35. తాజమహల్‌యొక్క లోపలి గదు లను, భవనంలోని భూగృహాలను సంవత్స రానికొక పర్యాయం తెరుస్తారు. వాటిని చూసేటందుకు మహమ్మదీయేతరులను అనుమతించరని 'బెనియర్' వ్రాస్తున్నాడు. దీనివల్ల తాజ్ అంతర్భాగమైన భూగృహంయొక్క 'హుష్ హుష్ రహస్యం' వెల్లడవుతుంది. ఇందు లోపలగల సొరంగ మార్గాలను పూర్తిగా తెరిపించి వాటిని కాంతివంతంగా చేసి—ఆ మార్గాలను, గదు లను శుభ్రపరచి—వాటిలో గల విశేషాలను చరిత్రవిద్యార్థులు, సామాన్యప్రజలు తెలుసు

కోడానికి తగిన అవకాశాన్ని ప్రభుత్వం గాని, విజ్ఞానవేత్తలు గాని కలుగచేయక పోవడం శోచనీయమైన విషయం!... చరిత్రపరిశోధకుల్ని, సామాన్య ప్రజల్ని వాటిని చూచేటందు కనుమతించడంవల్ల ప్రభుత్వానికి చాలా ఆదాయం కూడా వస్తుంది. ఇంజనీర్లు, చరిత్రపరిశోధ కులు, శిల్పులు మొదలైనవారంతా ఈ అపురూప దివ్యభవనపు అంతర్భాగ భూగృహ నిర్మాణ సౌందర్యాన్ని శోధించడం వల్ల లాభాన్ని పొందగలుగుతారు. చరిత్ర పరి శోధకులకుపయోగపడే అంశాలెన్నో యిందులో లభ్యం కాగలవు. అంతేగాక రహస్యంగా దాచబడిన ధనరాసులెన్నో ఈ ప్రాంతంలో నిక్షిప్తం చేయబడి వుండవచ్చు. లందుచేత ప్రభుత్వము, అన్నివర్గాల ప్రజలు కూడా ఈ భవనపు భూగృహ ద్వారాలను పూర్తిగా తెరిపించడంవల్ల విశేష లాభాన్ని పొందడం తథ్యం!

'36 'తారీఖ్—యి—తాజ్ మహల్' అనే ఒప్పందం కేవలం కల్పితమైనదని ఋజు వయింది.

37. తాజ్ మహల్‌యొక్క సింహ ద్వారాలు ఎత్తయిన బరువైన తలుపులచే నిర్మితమయినాయి.

38. తాజమహల్ లోపలిభాగాన ఒక వైపున నిలవ నీటికోసం నిర్మించబడిన పెద్ద కుండీలవల్లకూడా యిది సమా ధిగా మార్చబడక ముందొక నివాసభవన మని ఋజువుచెయ్యడానికి ఉపయోగపడు తున్నది.




షాజహాన్ తాజమహల్ నిర్మించేడన్న వాదన మనదేశచరిత్రలో జరిగిన అతిపెద్ద తప్పిదమన్న సంగతిని ఋజువు చెయ్యడానికి పైన నేను చెప్పిన అంశాలు చాలను కుంటాను. చాలకపోతే యిటువంటివెన్నో అంశాలను ఎత్తిచూపగలను. ఈ తాజ మహల్ నిర్మాణవిషయంలో వారు ప్రతిపా దించే నీటిబుడగవంటి వాదనను ఊది పారేస్తే, మధ్యయుగచరిత్రలోని చాలా విషయాలు యిటువంటి అసత్యకల్పనలేననే విషయం విశదమవుతుంది!.. ప్రసిద్ధ చరిత్రకారుడైన హెచ్. యమ్. ఇలియట్ మధ్యచరిత్రయొక్క 8 సంపుటాలకు వ్రాసిన పరిచయవాక్యాలను మనవాదనకు బలం చేకూర్చేవిగా మనం ఉపయోగించు కోవచ్చు. అతడు తన పరిచయవాక్యాలలో, 'హిందూదేశంలో మధ్యయుగానికి సంబం ధించిన మహమ్మదీయ యుగచరిత్ర అంతా కేవలం స్వార్థంతో కల్పించబడిన అబ ద్ధాలపుట్ట!' అని ఉటంకించేడు. ఈ చరిత్రంతా కేవలం కల్పించబడినట్టిదని గాఢంగా విశ్వసించి ఇలియట్‌కూడా ఈ చరిత్రాంశాలు కొన్ని నమ్మక తప్పలేదంటే ఈ అబద్ధాలచరిత్ర ఎంత ఘనంగా వ్రేళ్ళు నాటుకుపోయి ప్రచారంపొందిందో ఊహించండి — ఆఖరికి ఫెర్గూసన్, విన్సెంట్ స్మిత్‌వంటి ప్రసిద్ధచరిత్రకారులు కూడా ఆ చరిత్ర నిజమేననుకొని మోస పోయేరు. ఇప్పటికైనా మించిపోయినది లేదు!... చరిత్రపరిశోధకులు, ఉపాధ్యా యులు, విజ్ఞులు అందరూ కలసి హిందూ దేశచరిత్ర అనబడే ఈ కల్పిత అబద్ధాల పుట్టవంటి అడుసులో తలదూర్చి — పాఠ శాలలలోను, కళాశాలలలోను, పరిశోధనాల యాలలోను దీనిని బోధించడం మానివేసి, అందరూ కలసి యోచించి దీన్ని సరిదిద్దే ప్రయత్నం చెయ్యాలి.

ఇండోసారసినిక్ నిర్మాణ శిల్పపుష్టమని మధ్యయుగ చరిత్రకారులంతా ఘనంగా శ్లాఘించే బృహత్తర నిర్మాణమైన తాజ మహల్ నిర్మాణమే అనుమానాస్పదమైనదని దానిలోని సత్యాసత్యాలను నిరూపించి, మొగలు లకు కట్టబెట్టబడిన ఈ ఘనతను నిర్మూ లించ గలిగిననాడు — మిగిలిన సన్నకారు కట్టడాలు మొగలుల లేక మహమ్మదీయుల కాలంలో నిర్మించబడినవనే వాదనలన్నీ ఈ మహా ప్రవాహంలోపడి కొట్టుకు పోతాయి. అప్పుడు అవన్నీ ఆయా సుల్తా

నులు దుర్రాక్రమణచేసి వశపరచుకొని, వాటి నిర్మాణ చరిత్రను కలుషితం చేసినట్లు బయల్పడడం తథ్యం !... ఈ నిర్మాణా లన్నింటినీ మొగలులు లేదా మహమ్మదీయులు దుర్రాక్రమణచేసి—వాటి నిర్మాణ ఘనతను తమకు, లేదా తమ మంత్రులకు, లేదా —తమ అనుగ్రహానికి పాత్రులైనవారికి కట్టబెట్టినట్లు ధృవపడగలదు. ముస్లిమ్ పరిపాలకులకు ఘనతను కట్టబెట్టే ఈ అంశాలను చరిత్రనుండి మినహాయిస్తే, వారి పరిపాలనా కాలంలో హిందూదేశం ఒక ప్రత్యేక 'జీవవధ్యాస్థానం'గా వుండన్న అంశం మాత్రమే మిగులుతుంది.

తాజమహల్‌ని గురించి ప్రస్తుతం తెలియజేసిన నూతనాంశాలను ఉపాధ్యాయులు, విద్యార్థులు, ప్రొఫెసర్లు, విద్యావేత్తలు, విజ్ఞులు, చరిత్రకారులు, విశ్వవిద్యాలయాలలోని వారంతా చూసి, వీటివల్ల ప్రేరితులై అత్యంత ఉత్సాహకరమైన ఈ అంశాలపై కూలంకషంగా పరిశోధన జరిపి — ఇంతవరకూ అసంబద్ధమైన విషయాలగూడుగా, అబద్ధాల పుట్టగా, తప్పుల తడకగా ప్రచారమై వేళ్ళు నాటుకొనియున్న మధ్యయుగ చరిత్ర అడుగున నిస్సహాయంగా చిక్కుకొని, సహాయంకోసం ఘోషిస్తున్న భారతదేశ చరిత్రకు చేయూతనిచ్చి వెలుగులోకి తీసుకొచ్చే ప్రయత్నాలు చెయ్యమని మనవి చేస్తున్నాను కాని నేటి చరిత్రకారులు, ప్రజలు ధైర్యంగా నిలబడి నేడు ప్రచారంలోఉన్న చరిత్రలోగల సత్యా సత్యాలను బయటపెట్టమని ధైర్యంగా అడగగలరా ? ... మన దేశంలో మహమ్మదీయ యుగానికి చెందిన చరిత్రంతా నూటికి 99 వంతులు 'అరేబియన్ నైట్స్' వంటి కట్టు కథలతోనే నిండివుంది.

సినో ఇండియన్ శిల్పకళా ప్రాభవానికి పూర్తిపరిణామదశగా తాజమహల్ నిర్మాణ' శిల్పాన్ని ఘనంగా చాటుకొనే ఆచారం కొన్ని తరాలనుండి వున్నాది. తాజమహల్ ఒక రాజపుత్ర భవనమని, ఆభవనాన్ని ఒక మహమ్మదీయ సమాధిగా మార్చేరని తెలియగానే ఆ నమ్మకం వమ్మైపోయింది.

తాజమహల్ 17 వ శతాబ్దంలో నిర్మించబడిన ముస్లిమ్‌సమాధి కాదనియు, అంతకుముందు చాలాకాలం క్రిందటనే నిర్మితమైన హిందూ భవనమని తెలియగానే, దానిని గుర్తిస్తూ డాక్టర్ యమ్. ఫ్లాగ్‌మియర్ (Flagmeier) [ప్రెసిడెంట్ ఆఫ్ అమెరికన్ సొసైటీఫర్ స్కాండినేవియన్ ఎండ్ గ్రస్టావ్ స్టడీస్; 4059; మ్యనోస్ట్రీట్; నార్ సన్ట్. మిన్నెసోటా, U. S. A] 6-12-1965 వ తేదీన ఈ గ్రంథ రచయితకొక లేఖ వ్రాస్తూ యిలా పేర్కొన్నారు. 'చాలా కాలంనుండీ మేమంతా, తాజమహల్ని షాజహాన్—నిర్మించేడన్న జుగుప్సాకరమైన అసత్యాన్ని సత్యంగా భావించేము. మీరు మీయొక్క వాదనా పటిమవల్ల పరిశోధనల వల్ల ఆ నమ్మకాన్ని వమ్ము చెయ్యగలిగేరు. కల్పితమై కలుషితమైయున్న హిందూ దేశచరిత్రలో ఈ విస్మృతమైన సత్యాన్ని బాగా వెల్లడించి పునర్వ్యవస్థీకరించే బాధ్యత మీపైన వుంది. నేను తాజ్‌ను సందర్శించినప్పుడు బయటనుంచి చూసి అది మొగలుల నిర్మాణమని భావించినా, బాగా పరిశీలించి చూసేక అది మొగలుల నిర్మాణం కాదేమోనని భావించేను ఉదాహరణకి ఆ నాలుగు శిఖరాల నిర్మాణం హైందవ శిల్పకళ సమ్మిళితమై నేను రాజపుత్రస్థానంలో చూసిన హిందూభవనాలను — జ్ఞప్తికి తెచ్చేయి. ఇంతేకాక అష్టభుజాకార నిర్మాణం ఖచ్చితంగా హైందవమూలమైనదనే అనిపిస్తున్నది.' ఇదీ ఆ లేఖలోని సారాంశం.

['తాజమహల్' ఒక హిందూభవనము' అనే విస్మాల్యమైన చారిత్రకసత్యాన్ని పూర్తి వివరాలతో తెలుసుకోదలచినవారు, "The Taj Mahal is a Hindu palace, with stunning new direct evidence and illustrations" అనే పుస్తకాన్ని తెప్పించి చదవడం మంచిది. ఈ పుస్తకం వెల రూ. 4-00లు]

డాక్టరు రబున్ల

## తల తిరగటానికి ఎన్నో కారణాలు

కొంతమంది తలతిరిగితే అది రక్తపుపోటు వల్లనే అనుకుంటారు. అయిఉండవచ్చు గాని ఉండి తీరాలని లేదు ! కారణం తెలుసుకోవాలంటే ఎన్నో పరీక్షలు అవసరం.

ఒక మధ్య వయస్కుని చెవిలో గులిమి ఎక్కువగా ఉన్నందువల్ల అతనికి తల తిరిగేది. చెవి శుభ్రం చెయ్యగానే ఇది తగ్గింది.

ఒక మధ్య వయస్కురాలికి రక్తం సరిగ్గా లేకపోవటంవల్ల తల తిరిగేది. బి—12 ఇంజక్షన్లతో నయం అయింది.

కార్ఖానాలలో కార్బన్ మానాక్సయిడ్ ఉంటే అది పీల్చినవారికి తల తిరుగుతూ ఉంటుంది. గాలి శుభ్రంచేసే సాధనాలు వాడితే ఈ ప్రమాదం ఉండదు.

ఒక 60-70 సం॥ల మనుష్యునికి తల తిరిగేది. రక్త పరీక్ష ద్వారా అతనికి ఎన్నో సంవత్స



క.

రాల క్రింద సిఫిలిస్ తగిలి నయం అవలేదని తేలింది. అతనికి రక్తపుపోటు ఉన్నప్పటికీ సిఫిలిస్ చికిత్స తర్వాత తల తిరగటం ఆగిపోయింది.

హెచ్. ఎల్. హెర్షెన్‌సోన్
(నాసిరయిటు)




## జరిగిన కథ

కంట్రాక్టరు సుందరరావుగారు ఐశ్వర్యవంతుడు. ఆయన భార్య శాంతమ్మ. వారి ఇద్దరి కొడుకుల తర్వాతది కల్యాణి. కల్యాణికి మౌళి తటస్థపడతాడు. అతను పేదవాడు. వాళ్ళ పరిచయం ప్రేమగా మారుతుంది. తండ్రి ఆమె కొక పెద్ద సంబంధం తీసుకువస్తాడు. కల్యాణి ఇష్టపడలేదు. కొంత డబ్బు తీసుకుని మౌళితో మద్రాసు పారిపోవాలనుకుంటుంది. ఇద్దరూ కలిసి మద్రాసు వచ్చేస్తారు. కొద్దిరోజులకే ఇద్దరికీ మనః కేశాలు వస్తాయి. మౌళి కల్యాణిని అనుమానిస్తాడు. కల్యాణి సుమిత్రవద్దకి వచ్చి ఆమె సహాయాన్ని కోరుతుంది. సుమిత్ర మౌళి దగ్గరకు వచ్చి అతన్ని మనోవ్యథ నుంచి తప్పించాలని చూస్తుంది. కల్యాణిపై అతని కోపాన్ని పోగొట్టాలన్న ప్రయత్నాలన్నీ వ్యర్థమవుతుంటాయి. మౌళి కల్యాణికి చేరువవుతూనే దూరమవుతుంటాడు. కల్యాణి దిగులు నానాటికీ హెచ్చవుతూ వుంటుంది. కల్యాణి ప్రవర్తనని అపార్థం చేసుకొని ఆమెని ఉద్యోగం నుంచి తీసేస్తారు. నారాయణమూర్తి జ్వరంలో ఉన్నాడని తెలిసి అతని వద్దే ఉండి సేవ చేయడానికి నిశ్చయించుకుంటుంది మైథిలి. మైథిలి నారాయణ మూర్తుల వివాహానికి కల్యాణి పూనుకుంటుంది.

## 15

సరోజిని వెళ్ళేసరికి మౌళి లేడు. కల్యాణి దగ్గరున్నాడు.

వగరుస్తూ నిల్చున్న సరోజినిని చూసి విస్తుపోయింది సుమిత్ర.

సుమిత్ర వచ్చాక సరోజిని ఆ గడప తొక్కలేదు —

ఎక్కడికీ వెళ్ళని సరోజిని— తన దగ్గరకి — అందులోను అంత ఆవేశంతో రావటంతో సుమిత్రకేం మాట్లాడాలో తోచలేదు —

'మౌళిగారు లేరా ?' అంది సరోజిని రొప్పుతూ—

'లేరు కల్యాణి ఎలా ఉందో చూచిరావటానికి వెళ్ళారు.'

'అది...అది ... అంతా అబద్ధం — లేదు—ఏం జరగలేదు—'

సరోజిని నుదుటికి పట్టిన చెమట పైటకొంగుతో తుడుచుకుంది.

'ఏవిటీ ?' అయోమయంగా అడిగింది సుమిత్ర — సరోజిని గొంతు పూడుకుపోయింది. తను చెప్పదలచుకున్నది చెప్పగలగటం అంత తేలిక కాదనుకొంది.

'ఏవిటండీ ?' మళ్ళీ ఆందోళనగా అంది సుమిత్ర.

'నాకు మావారి సంగతి తెలుసు — ఆయనే స్వయంగా ఒప్పుకుంటే అది తప్పకుండా నిజం—సందేహం లేదు—'

'ఏవిటా నిజం ?'

'మావారు— ఆయనవల్ల కల్యాణిగారికే అపచారమూ జరగలేదు—ఆ రోజు ఏం జరిగిందో నాకు తెలీదు. నేను సమంగా వినలేదు—ఇప్పుడూ వినలేదు—కానీ, ఒక్కటి మాత్రం నిజం—ఈయన కల్యాణిగారికే అపచారమూ చెయ్యలేదు. మౌళిగారికీ సంగతి చెప్పండి—ఇప్పటికయినా ఆవిడను ఇంటికి తెచ్చుకుని ఇద్దరి బ్రతుకులూ వ్యర్థం కాకుండా కాపాడుకోమని చెప్పండి. నేను వెళ్తాను—'

సరోజిని వెళ్ళిపోయింది.

స్థాణువులా నిలబడిపోయింది సుమిత్ర —ఇంతవరకూ మౌళికీ కల్యాణికి ఏవో అపార్థాలొచ్చాయనే ఊహించుకుంది. ఒక వంక మౌళి చిరాకూ, ఆ ప్రస్తావన తెచ్చినప్పుడల్లా రెచ్చిపోయే అతని తాగుడు, కల్యాణి గుండెనొప్పి ఆమెకు గుచ్చి గుచ్చి ప్రశ్నించే అవకాశం కలగనియ్యలేదు.

ఇదా సంగతి ? మౌళి కల్యాణిని అనుమానించాడా ? అంతటి సంకుచిత హృదయుడు కాడే తనకు తెలిసినంత వరకూ ? అసలా భార్యాభర్తలకు ఒకరి ప్రేమలో ఒకరికి కించిత్తయినా అనుమానమే లేదే ! ఏం జరిగిందసలు ?

సైకిల్‌గంట మ్రోతకు ఆలోచనల్లోంచి తేరుకుని తలుపులు తెరిచింది సుమిత్ర—నారాయణమూర్తి సైకిల్‌మీదకు వరిగి నిల్చున్నాడు.

'లోపలకు రండి—' అంది సుమిత్ర—

'ఇప్పుడుకాదు— కల్యాణిగారికి నొప్పులు ప్రారంభ మవుతున్నాయి. హాస్పిటల్‌కు తీసికెళ్ళాలి మౌళిగారు మిమ్మల్ని తీసుకు రమ్మన్నారు త్వరగారండి—'

అంటూనే సైకిలెక్కబోయాడు — అతనిముఖంలో గాభరా చూసిన సుమిత్ర

హృదయం దడ దడ లాడింది—

'ఒక్క క్షణం ఆగండి—అసలు కళ్యాణి విషయం ఏం జరిగింది? మీకు తెలుసా?'

నారాయణమూర్తి నొసలు చిట్లించుకున్నాడు —

'భలే సమయం దొరికింది మీకు ఇవన్నీ విచారించటానికి...'

సుమిత్ర ముఖం పాలిపోయింది.

'ఇప్పుడే సరోజినిగారొచ్చి వసంతరావు వల్ల కల్యాణికే అపచారమూ జరగలేదని ఆ విషయం ఆయనే స్వయంగా ఒప్పుకున్నారనీ చెప్పారు నాకీసంగతి తెలీదు. అందుకని లడిగాను ఇప్పుడు వహొళికి చెప్పాలికదా, ఈవిషయం? సంగతేమిటో తెలీకుండా ఎలా? అందుకని అడిగాను'

నారాయణమూర్తి ముఖం వెలిగిపోయింది.

'నాకు తెలుసు — నేను అనుమానిస్తూనే ఉన్నాను. కానీ వసంతరావు ఒప్పుకోడనీ తెలుసు ఒప్పుకున్నాడు. అతనిలోనూ మానవత్వం ఏమూలో ఉందని నిరూపించుకున్నాడు'

గబగబ స్కూటరెక్కబోతున్న నారాయణమూర్తిని ఆపుచేసింది సుమిత్ర—

'ఆగండి— నేనూ వస్తున్నాను. నాకు దారిలో చెప్పండి—అసలేం జరిగిందో...

అంటూ గుమ్మానికి తాళం వేసింది

* * *

'వహ్వా! ఏం ధర్మం? ఏం న్యాయం? మీ ధర్మం ఇంత గుడ్డిదా? ఈనాడు ఏం జరగలేదని తెలిసి పశ్చాత్తాపంతో కృంగిపోతున్నారు. కానీ అసలు దీనికంతకూ బాధ్యత ఎవరిది? వసంతరావు భోజనానికి వస్తున్నట్లు మీరే స్వయంగా చీటీరాసి పంపారు వసంతరావు విషయం అందరికీ తెలుసు—అట్లాంటప్పుడు వసంతరావును ఒంటరిగా పంపి మీరు వైజాగ్ వెళ్లారు ఎందుకెళ్లారు? ఆ ఉద్యోగంకోసం కదూ! మీ ఉద్యోగం మీకు కల్యాణి కంటె ఎక్కువైందా? మీరు వెళ్లకపోతే వసంతరావు మానేస్తాడనుకున్నారా? అతనెలాటి నీచుడో తెలీదా? ఇంతాచేసి తరువాత ఆ అమాయకురాలిని కొల్పుకుంటున్నారా? శీలం కోల్పోయింది గనుక కల్యాణిమీద ద్వేషమా? న్యాయానికి శీలం కోల్పోయింది మీరు— కల్యాణికాదు— ద్వేషింపబడవలసిన వ్యక్తి మీరు — కల్యాణికాదు— కల్యాణి మిమ్మల్ని క్షమించింది. మీ బలహీనతను మీ దారిద్ర్య భయాన్నీ అర్థం చేసుకుంది. ఇంకా మిమ్మల్ని ప్రేమిస్తూనే ఉంది. అయినా మీరు.. ద్వేషించినవానికి బదులుగా ప్రేమించి పూజించిన కల్యాణిని ద్వేషించగలిగారు. ఆ అమృతమూర్తి బ్రతుకంతా విషమయం చేసారు- మిమ్మల్ని మీరూ చిత్రవధ చేసుకున్నారు అయ్యయ్యో! నాకు సంగతి ఇదని తెలియదు—తెలిస్తే కల్యాణి

సుమిత్ర ఆరోపణల కేలాటి సమాధానమూ చెప్పలేదు. ఇన్నాళ్ళూ ఏది జరగాలని తపస్సు చేసాడో, అది జరిగేసరికి — కల్యాణి పవిత్రురాలని తెలిసేసరికి — అంతరాత్మ దాటికి తట్టుకోలేక పోతున్నాడు.

లేడీడాక్టర్ ఇవతలికొచ్చింది—

అందరూ ఆతృతగా చూసారు —

'ఇప్పట్లో పురుడు రాదు హాస్పిటల్లో చేర్చుకుంటాను బహుశః ఇవాళ రాత్రి రావచ్చు—'అని వెళ్ళిపోయింది.




క్షమించగలిగినా, నేను మిమ్మల్ని క్షమించగలిగేదాన్నికాదు......'

సుమిత్ర కళ్లలోంచి నిప్పులు కురుస్తున్నాయి అది హాస్పిటల్ అనీ నలుగురూ తిరిగే స్థలమనీ గమనింపే రాలేదు కల్యాణికి జరిగిన దురన్యాయానికి నిలువునా దహించుకుపోతోంది సుమిత్ర —

ఎవరో శరీరంలోంచి ప్రాణాలన్నీ పిండి లాగుతోన్నట్లు అనిపించింది వహొళికి— అతను సుమిత్రముఖంకేసి చూడలేదు.

వెయిటింగ్ రూంలోని కుర్చీలో నీరసంగా వాల్చబడింది కల్యాణి—నిశ్శబ్దంగా ఉన్న అందరినీ వింతగా చూసింది-వహొళి ముఖం చూస్తూనే గాభరా పడిపోయింది.

'అలా ఉన్నారేం ? ఏమయింది?'

ఆందోళనగా అడిగింది—

వహొళి పలకలేక పోయాడు — అణచి అణచి ఉంచిన ఉబికి ఉబికి వస్తోన్న కన్నీటి కెరటంతో అతనిదృష్టి మసకబడిపోయింది.

కోపాన్ని అణచుకుంటూ బుసలుకొట్టూ ముఖం తిప్పుకొంది సుమిత్ర.

నారాయణమూర్తి ముందుకొచ్చాడు —

'లేడీ డాక్టర్ రాత్రికికాని పురుడు రాదంటున్నారు గదా! ఇక్కడెందుకు? నా మ్యూడెంట్ ఒకడికి కారుంది — ఇవాళంతా మనకిస్తానన్నాడు. నేనడుగుతే ఇంటికిపోదాం పదండి—'

సుమిత్రా, మైథిలీ కళ్యాణిని నడిపించుకొంటూ తీసుకొచ్చి కార్లో కూర్చోబెట్టారు —

'ఎక్కడికి తీసికెళ్దాం?, కళ్యాణి గదికేనా?'

వనాళిని చురచుర చూస్తూ అడిగింది సుమిత్ర —

రెండుచేతుల్తో తలపట్టుకున్న వనాళి భుజంచుట్టూ చెయ్యేసి కార్లో కళ్యాణి పక్కన కూర్చోబెట్టాడు నారాయణమూర్తి —డ్రైవర్‌తో వనాళి ఇంటికే తీసుకుపోనియ్యమని చెప్పాడు —

మైథిలీ సుమిత్రలు రిక్షాలో కూచున్నారు — నారాయణమూర్తి తన సైకిలెక్కాడు —

కొన్ని యుగాలులా నడిచిన కొన్నినెలల తరువాత తిరిగి వనాళితో కలిసి తమ ఇంట్లోకి అడుగు పెడుతోంటే కళ్యాణికి కళ్లలో నీళ్లుతిరిగాయి.

'వీళ్లు నా మనసులో కోరిక గ్రహించినట్లు ఇక్కడికి తీసుకొచ్చారు. మళ్లీ ఈ ఇంట్లోకి రాగలనో లేదో? చివరిసారి కొంతసేపు ఇక్కడ గడపాలనుకొన్నాను—' అనుకొంది మనసులో కళ్యాణి—

సుమిత్ర పక్క దులిపి వేసింది

'రా! కళ్యాణీ! కొంచెంసేపు పడుకో!'

కళ్యాణి నిలువునా వణికింది.

'ఉహూ! రాలేను వద్దు—ఇక ఈజన్మకి ఆ గదికీ నాకూ ఋణం తీరిపోయింది.'

కళ్లు రెండూ చేత్తో అదుముకొంది—

సుమిత్ర కళ్యాణి ఎదురుగావచ్చి కళ్యాణి రెండుచేతులూ పట్టుకొంది.

'కళ్యాణీ! ఆ పక్క నువ్వు ఎలా వదిలావో అలాగే ఉంది. ఏవిధంగానూ అపవిత్రం కాలేదు. ఏదో ఒకనాడు నువ్వొచ్చి మళ్లీ ఉపయోగిస్తావనే ఆశతో వేఇన్నాళ్లూ దాన్ని శుభ్రం చేస్తున్నాను'

'అదికాదు—అదికాదు—సుమిత్రా! అలా మాట్లాడకు—నేను సహించలేను. నాకు తెలుసు—నువ్వు—అదికాదు — అసలు నేనే ఇంక దాన్ని ఉపయోగించలేను. ఆ అదృష్టం నా జీవితంలోంచి శాశ్వతంగా జారిపోయింది'

# ఏది సత్యం?...

వనాళి కళ్యాణి దగ్గరగా వచ్చాడు—

'కళ్యాణీ! ఎంత సిగ్గులేనివాణ్నో చూడు. ఇంకా నీ ఎదురుగా నిలబడి మాట్లాడగలుగుతున్నాను. ఎంత బండవాణ్నో చూడు. ఇప్పటికే నా గుండెలు బద్దలుకాలేదు-ఎంత స్వార్థపరుణ్నో చూడు — ఇప్పటికీ నీ క్షమను యాచిస్తున్నాను నిన్ను చిత్రహింస పెట్టాను. కానీ కళ్యాణీ! నేను అనుభవించిన క్షోభ సామాన్యమైనది కాదు నన్ను నమ్మ కళ్యాణీ! అన్నింటికంటె నీ ఎడబాటే మరీ దుస్సహమయింది నాకు—ఏదెలా జరిగినా వచ్చి నీకాళ్లో వాలిపోవాలని కొట్టుకుపోతున్న నా మనసును అర్థంలేని ద్వేషంతో అదుపులో పెట్టుకోలేక నానాయాతనాపడ్డాను'

కళ్యాణి వళ్లో తల పెట్టుకుని పసిపిల్లాడిలా ఏడ్చేసాడు వనాళి.

కళ్యాణి భారంగా నిట్టూర్చింది

'అయితే వసంతరావుగారు నిజాన్ని ఒప్పుకున్నారన్న మాట!'

నారాయణమూర్తి సుమిత్రా ఉలిక్కిపడ్డారు. 'అయితే నీకూ తెలుసా?' ఇద్దరూ ఏకకంఠంతో ఒకేసారి ఆశ్చర్యంగా అడిగారు.

'ఎవరితో చెప్పుకోను? ఏమని చెప్పుకోను? ఆనాడు (కళ్యాణిగుండెలు గట్టిగా పట్టుకొంది) వసంతరావు గారొచ్చారు. మీరు వస్తున్నారనుకొన్నాను. కానీ వసంతరావుగారు నవ్వారు.

'వనాళి వైజాక్ వెళ్లాడు, 'మీరు వెళ్లండి నేను లేకపోతేనేం? నేను లేకపోవటమే మంచిది అన్నాడు.' అందుకే నే నొచ్చాను—'

నేనేం మాట్లాడలేక పోయాను మీరు వైజాగ్ ఎందుకెళ్లిందీ నాకు తెలీలేదు,

'ఆయన వైజాగ్ ఎందుకెళ్లారు?' అన్నాను మర్యాదగానే!

'ఎందుకేవిటి? మనకు లైన్‌క్లియర్ చెయ్యటానికి' అన్నాడు మోటుగా.

ఆ మాటలు వింటూనే నా శరీరం జలదరించింది. నమ్మలేకపోయాను. నావనాళి అలా ప్రవర్తిస్తారని అనుకోలేకపోయాను— —కానీ, ఏరీ మరి? స్వయంగా వసంతరావుతో కలిసివస్తున్నట్లు చీటీ పంపించి ఏమయ్యారు?

నా తల తిరగసాగింది.

'ఆనాడు నిన్ను గోదావరి గట్టున చూసినదగ్గర్నుంచీ ఎప్పుడు నిన్ను అనుభవిద్దామా, అని ఉంది. ఇన్నాళ్లకు అవకాశం కలిసొచ్చింది.'

పరమ మోటుగా మాట్లాడుతున్నాడు వసంతరావు—నాకేదీ అర్థం కావటం లేదు—నా తలంతా ఇంకా తిరుగుతోనే వుంది. తూలి పడబోయాను. వసంతరావు పట్టుకున్నాడు.

పిచ్చిగా చూసాను. చటుక్కున వదిలేసాడు. రెండడుగులు వెనక్కు తగ్గాడు. కానీ, మళ్లీ అక్కడే నిలబడ్డాడు.

'నీ మొగుడికి లేని అభ్యంతరం నీ కెందుకూ? అతడే స్వయంగా నన్ను పంపించాడు మీ పూర్వపు పతివ్రతలు భర్తమాట శిరసావహించి అతడు ఏర్పరచుకోమని ఆజ్ఞాపించిన పరపురుషులతో సంబంధం ఏర్పరచుకునేవారటగా! నువ్వు నన్ను అంగీకరిస్తే పతివ్రతవైపోతావు' అంటూ నవ్వాడు.

నిలబడలేక కూలిపోయాను

వసంతరావు కంగారుపడ్డాడు—దగ్గరగా వచ్చి నా మీదికి వంగి చూసాడు—కొంచెం నీళ్లు తెచ్చి నా ముఖంమీద చిలకరించాడు.

చటుక్కున ముఖం తిప్పుకున్నాను.

'నేను చచ్చిపోయినా సంతోషమే! కానీ మీ ఉపచారాలు మాత్రం సహించలేను. అబలను. నిస్సహాయంగా పడివున్నాను. ఏం చేసినా చెయ్యగలరు మీ యిష్టం.'

వసంతరావు ఒక్కక్షణం నా వంక వెర్రిగా చూసి తల వంచుకుని వెళ్లిపోయాడు—

ఈ మానవుడు చిత్రమైన ప్రాణి. తనను తాను వంచించుకొని పరమక్షుద్రుడిగా తయారవుతాడు — కానీ ఏ క్షణంలోనో అతడి లోలోపల అణగివున్న మానవత్వం ఒక్కసారిగా మేలుకొంటుంది.

ఆ నాడు నేను నిస్సహాయురాలిని— తీవ్రంగా ప్రతిఘటించేందుకు కూడా శక్తి

# ఏది సత్యం?...

నవ్వు కావాలి. నవ్వు దూరం కాకు కల్యాణీ!'

కల్యాణి రొమ్ముల మధ్య తల దాచుకుని ఆర్తితో ఆమె శరీరాన్ని చేతులతో మృదువుగా నిమురుతూ గోలపెట్టాడు వశౌరి—

కల్యాణి బాధగా మూలిగింది. చటుక్కున లేచాడు వశౌరి—

బాధతో మెలికలు తిరిగిపోతున్న కల్యాణిని నిస్సహాయంగా చూస్తున్న వశౌరి మనసు కూడా మెలికలు తిరిగిపోతూంది.

పిలవగానే లేడీ డాక్టర్ వచ్చింది—నొప్పులు ప్రారంభమయ్యాయని చెప్పి లేబర్‌రూంలోకి తీసికెళ్ళింది.

అందరూ ప్రాణాలు ఉగ్గబట్టుకుని కూర్చున్నారు. గంటా గంటన్నర పోయాక లేడీ డాక్టర్ బయటికొచ్చింది. మాట్లాడే సాహసం లేక అందరూ కళ్ళతో దీనంగా ప్రశ్నించారు.

'ఆవిడకు నొప్పులందుకోవటం లేదు. ఆపరేషన్‌చేసి శిశువును తీసెయ్యవలసిందే!'

గంభీరంగా అని మళ్ళీ లోపలికెళ్ళిపోయింది. లేడీడాక్టర్—

అందరి గుండెల్లోనూ బండ పడింది—వెళ్ళకూడదని తెలిసినా వశౌరి చటుక్కున లోపలికెళ్ళాడు—

'డాక్టర్! ఎలాగైనా నా కల్యాణిని రక్షించండి. మీకేం కావలిసినా ఇచ్చుకుంటాను—'

ఆవిడ పాదాలదగ్గర కూలిపోయాడు. డాక్టర్ చిరాకుపడింది.

'నే నేమైనా దేవుణ్నా? నా శక్తికొద్దీ ప్రయత్నిస్తాను. మీరు అవతలుండండి—'

వశౌరి తన శరీరాన్ని ఇవతలికీడ్చాడు—అవును—దేవుడు! మానవులకు కష్టాల్లో ఓదార్పు—నిరాశల్లో ఆశ—నికృష్ట సమయాల్లో అండ—బలహీనపు క్షణాల్లో హెచ్చరిక—అశాంతితో వేగిపోతూ నిలవలేని మనసులకు స్థిరమైన ఆధారం—ఆ దేవుడే రక్షించాలి.

ఆర్తితో రెండుచేతులూ జోడించాడు దివ్యత్వాన్నీ దానవత్వాన్నీ తనలోనే రంగరించుకున్న ఆ మానవుడు—

(అయిపోయింది)

అధికారులకూ, ప్రభువులకూ తమ ఆశ్రితులపైన పక్షపాతం ఉండడం సహజం. తమను కనిపెట్టుకొని ఉన్న వారిమీద అభిమానం చూపడం, వాళ్ళకి తగిన సహాయం చెయ్యడం ఆశ్రయ స్థానంలో ఉన్నవారి ధర్మం. ఆ విధంగానే ఆశ్రితులకు తమకు ఆశ్రయంగా ఉన్న వారిమీద గౌరవం వుండడం విధి.

ఆశ్రయం మంచిస్థితిలో ఉన్నప్పుడు దానిని కనిపెట్టుకుని వుండి సుఖంగా వుంటూ, ఆ ఆశ్రయానికి అపాయం కలిగే స్థితిలో దాన్ని విడిచిపోవడం విశ్వాస ఘాతకుల లక్షణం! అట్టి విశ్వాస ఘాతకులూ వుంటారు. నూటికొక్క రయినా కృతజ్ఞులు వుండకపోరు అట్టి వారు తమ ఆశ్రయాన్ని ఎట్టి కష్ట స్థితిలోనయినా విడవకుండానే వుంటారు. తమ కష్టసుఖాలను గమనించరు అంతే కాదు, తమ మేలు కోరుకోకుండా ఆ ఆశ్రయం మేలునే మనసారా కోరు కుంటారు.

దీనిని గురించిన చిన్న ఇతిహాసం వున్నది.

ఒకానొక నగరానికి సమీపంలో ఒక వనం ఉంటున్నది. ఆ వూరిలోవున్న కిరాతుడు ఒకడు ప్రతిదినమూ అడవికి వేటకు పోయి మృగాలను వేటాడి, తమామ్ లంగా జీవిస్తూ ఉన్నాడు. ఆ మృగజీవి తన బాణాలకు విషం పూసి మృగా లను కొట్టడం వరిపాటి. గట్టిదెబ్బ తగలకపోయినా—చిన్నదెబ్బ తగిలినా సరే— వెంటనే దెబ్బతిన్న మృగం చావాలని అతని కోరిక. అందుకోసమే ఈ ఉపాయం ఆలో చించ బడింది.

ఒకనాడా వేటకాడు మామూలుప్రకారం అడవికి పోయాడు. దూరంగా ఒక మృగం కనబడింది. దాన్ని గురిచూసి కొట్టేసమ యంలో అది తప్పించుకు పారిపోయింది. ఆ బాణం ఒక చెట్టుకు తగిలింది. ఆబాణం విషలిప్తమై ఉండడంవల్ల, పువ్వుల తోనూ, ఫలాలతోనూ కలకలలాడుతూవున్న ఆ వృక్షం కొద్దిరోజుల్లోనే ఎండిపోయింది. మొరడూ, కొమ్మలూ, ఉపశాఖలూ తప్ప— ఆకులుకూడా లేకుండాపోయాయి. ఆ వృక్షం నివాసంగా చేసుకున్న పక్షులన్నీ దాన్ని విడిచిపెట్టి మరొకచోటికి వెళ్ళిపోయాయి.




కాని, ఒక్క చిలుకమాత్రం ఆ వృక్షాన్ని విడిచిపెట్టలేదు. ఎక్కడో ఆహారం సంపా దించుకుంటూ, ఆ చెట్టుమీదే నివసించ సాగింది.

ఈ చిలుకపద్ధతి అందరికీ ఆశ్చర్యం కలిగించింది. ప్రయోజనం లేకపోయినా, బాధపడుతూ అది అక్కడ ఎందుకు వుండాలి ? అని అందరూ అనుకొనేవారు. ఒకసారి గగనమార్గాన పోతూవున్న కొందరు దేవతలు ఈ వింతనుచూచి, ఆశ్చర్యపడి దేవేంద్రుడికి తెలియజేశారు. అప్పుడు దేవేం ద్రుడు మారువేషంతో అక్కడికివచ్చి, ఆ చిలుకనుచూసి 'ఓ చిలుకా! అన్నిపక్షులూ విడిచిపోగా నీవు మాత్రం మొరడుబారిన యీ చెట్టునే ఆశ్రయించుకుని ఎందుకు కూర్చున్నావు?' అని ప్రశ్నిం చాడు. ప్రతిభాశాలి అయిన ఆ చిలుక ఆ వచ్చినవాడు యింద్రుడని గ్రహిం చింది. గ్రహించి 'అమరాధిపా! ఈ వృక్షం బాగా ఉన్నప్పుడు దాన్ని ఆశ్రయించి మోడయి పోయినప్పుడు విడిచిపెట్టడం ధర్మమా ? కష్టసుఖాలు రెండిట్లోనూ సమానంగా వుండడం ధర్మంకదా! అందు వల్ల నేను వృక్షాన్ని విడిచి పోదలచలేదు. ఎన్నికష్టాలయినా సహించి యిక్కడే ఉండిపోతాను' అని చెప్పింది.

ఆ చిలుక తన్ను తెలుసుకొన్నందుకు ఇంద్రుడు ఆశ్చర్యపడి దాని కృతజ్ఞతను మెచ్చుకున్నాడు. మెచ్చుకొని నిజరూపంతో ప్రత్యక్షమయి 'నీకేమి వరం కావాలో కోరుకో' అని చిలుకతో అన్నాడు. అది 'ఓ దేవప్రభూ! నాకు ఎటువంటి కోరికా లేదు. అయినా నీవంటి గొప్పవాడు వరమిస్తానంటే తిరస్కరించడం భావ్యం కాదు. నీవు నాకు వరం యివ్వదలిస్తే యీ వృక్షం తన పూర్వపుస్థితిని పొందేటట్లు వరం ఇయ్యి. అదే నాకు పదివేలు' అని చెప్పింది.

ఆ శుకంయొక్క నిస్వార్థ త్యాగానికీ, ఆశ్రయంమీద వుండే అభిమానానికీ ఇంద్రుడు చాలా సంతోషించి ఆ వృక్షం పూర్వం రీతినే పుష్పాలతోనూ, ఫలాల తోనూ కలకలలాడుతూ ఉండేటట్లు చేశాడు. ●



# ఒక పువ్వు రాలింది




'వేణూ !'

ఏదో పుస్తకం చదువుతున్న వేణు తల ఎత్తి చూశాడు ఏమిటన్నట్టుగా.

'నీకథ పడింది పత్రికలో' ముసిముసిగా నవ్వుతూ అంది రమ.

'రేపు శుభలేఖల్లో నీపేరు కూడా పడుతుందిలే!' ఉడుక్కున్నాడు వేణు. ప్రొద్దుట జరిగిన సంఘటన అతని కళ్ల ముందు ప్రత్యక్షమైయింది. తను ఎన్ని కథలు తనపేరుతో పంపినా అచ్చు కాలేదని రమతో నీ పేరుతో పంపిస్తానంటే ససేమిరా అని తిరస్కరించింది. తను కోపంగా కాలేజీకి వెళ్లిపోయాడు. సాయంత్రం తిరిగి వచ్చినప్పుడు తను అక్కతో మాట్లాడ లేదు. అందుకే ఇప్పుడు క్షమార్పణ చెప్పి నీ ఇష్టం ప్రకారమే చెయ్యమంటుంది కాబోలు. కానీ కాస్త బెట్టుచేద్దాం. తను స్వయంగా చెప్పేవరకూ వేణు స్వగతంగా అనుకుని తిరిగి పుస్తకం పఠనంలో మునిగిపోయాడు.

రమ చిలిపిగా 'చాలించండోయ్ తమ్ముంగారు తమ బెట్టుని. తమ ఇష్టం ప్రకారమే నాపేరు మీ కథలకి దత్తత ఇస్తున్నాను. కాని ఒక్క షరత్ మీద— కొన్నాళ్లు మాత్రమే, దైవం అనుకూలించి నీ కథలు పడితే తిరిగి నేను నాపేరు ఇక ససేమిరా పెట్టనీను.' అంది.

'థాంక్యూ ! సిస్టర్. అంతవరకూ చాలు' వేణు సంతోషంగా ఒప్పుకున్నాడు.

రమ తృప్తిగా నిట్టూర్చింది.

నాలుగునెలలు గడిచాయి, ప్రచురణకి అంగీకరిస్తూ రమపేర కార్డు వచ్చింది. వేణు నిజంగా ఆనందపడి పోయాడు. రమ పేరులో బలం వుందని అతనికి పూర్తిగా నమ్మకం కుదిరింది. అలా వరసగా నాలుగు నెల్లు పంపిన కథలన్నీ అన్ని పత్రికలూ వేసుకున్నాయి దాంతో పాఠకుల అభినందనలతో విమర్శలతో లెటర్స్ రావడం మొదలుపెట్టాయి. అన్నింటికీ ఓపిగ్గా జవాబులు వ్రాసేవాడు వేణు.

రమ వీటన్నిటికీ దూరంగా వుండే వేణు సంతోషంగా వీటివిషయం చెప్పినప్పుడు మాత్రం తన ఆనందాన్ని ప్రకటించేది. అది తనపేరు అచ్చయినందుకనో, లేక తమ్ముడు ప్రయోజకుడయ్యాడనో తెలీలేదు వేణుకి.

కాలచక్రంలో ఏడాది గిర్రున తిరిగి పోయింది. వేణు ఉద్యోగాన్వేషణలో పడి తన రచనలని కాస్త తగ్గించాడు. కాని కథలు కాకుండా నవలారచన మాత్రం అడపాదడపా చేస్తూనే వున్నాడు. మొదటి సారిగా నవల 'అతకని తీగలు' రాసి పంపించాడు. అది సీరియల్‌గా ప్రచురితమైయింది. సరిగ్గా ఇదే టైములో రమకి శ్రీధర్‌తో వివాహం నిశ్చయమైయింది. రమ తలితండ్రులకి ఈ సంబంధం అన్ని విధాల నచ్చింది. కారణం శ్రీధర్‌కి ఒక్క తల్లితప్ప ఇంకెవ్వరూ లేరు, చచ్చేవరకూ చాలినంత ఆస్తి, నలుగురిలో పలుకుబడికల ఉద్యోగం, కట్నం తీసుకోని శ్రీధర్ ఆదర్శం, అన్నింటినీ మించి వరుడు మంచివాడు, అందగాడు.

ఒక దివ్యముహూర్తంలో రమ మెడలో మూడుముళ్లు పడిపోయాయి.

అత్తవారింట్లో మూడురాత్రులు గడిపి సెలవు లేదంటూ రమని తీసుకుని హైద్రాబాద్ ప్రయాణమైయ్యాడు శ్రీధర్.

ప్రయాణం ఇంకా పావుగంట వుంటే

రమ వేణు గదికి వచ్చింది. కిటికీనుంచి శూన్యంలోకి చూస్తున్న వేణు చటుక్కున తిరిగి చూసాడు. ఎదురుగా రమ, కాదు, కాదు లక్ష్మీదేవి... కొత్తగా వెలసిన మాంగల్యం, నల్లపూసలు ఆమె పచ్చని శంఖంలాంటి మెడని శోభాయమానంగా చేస్తున్నాయి. పారాణి పూసిన పాదాలు, నుదుటని ఎర్రని గుండ్రటి కుంకుమ, తల్లో నిండుగా పూలు, ఎర్రని పట్టు చీరతో లక్ష్మీదేవిలా సాక్షాత్కరించిన రమని క్షణంసేపు కళ్ళార్పకుండా చూసాడు వేణు.

'వేణూ! వెళ్ళొస్తా రా?' ఎటో చూస్తూ అంది రమ తిరిగి.

'ఒక్కమాట. అది నీ కథలు. నీకు రావలసినపేరు నాకు వస్తుంటే అక్కగా నా హృదయం ఎంత చిత్రహింసకు లోనవుతుందో ఆలోచించరా!'

'అక్కా దయచేసి నన్నది అడగవద్దు. నీవు దూరంగా వెళ్ళిపోతున్నా ఈ కథలలో నీ పేరు చూసి ఆ లోటు భర్తీ చేసుకుని తృప్తిపడతాను' ప్రాధేయపూర్వకంగా అర్థించాడు వేణు.

రమ ఇంకేం మాట్లాడలేకపోయింది. ఆ తరువాత కారులో తన భర్తతో సాగిపోయింది రమ.

* * *

కాఫీ తీసుకుని మెల్లగా శ్రీధర్ గదిలో అడుగుపెట్టింది రమ ఒకరోజు. అతనిచేతిలో ఏదో లెటర్ వుంది. కాఫీ టేబిల్ మీదుంచి 'ఎవరిదగ్గరినుంచండీ' అంది రమ.

'చూసుకో!' కాఫీ సిప్ చేస్తూ కార్డు ఇచ్చాడు శ్రీధర్.

రమ గబగబా చదివింది.

అక్కా,

నా కథకి ఫస్ట్ ప్రయిజ్ వచ్చింది. వెయ్యిరూపాయలు. అది అందినట్లుగా నీ సంతకం కావాలి. ఇప్పుడేం చెయ్యాలో తోచడం లేదు. ఒక్కసారివచ్చి వెళ్ళితే బాగుంటుంది. బావగారి పర్మిషన్ కావాలి కదూ! అడిగిచూడు. అయినా నీవుమాత్రం బావగారిని వదిలి వస్తావేమిటి! ఎలాగైనా రావే అక్కా! వస్తావని ఆశిస్తూ 'వేణు'.

రమ చదవడం ముగించి తలెత్తి చూసింది.

'రమా! ఏమిటిది. అతనికథకి ప్రయిజ్ వస్తే నీవెందుకు మధ్య' ప్రశ్నించాడు శ్రీధర్.

'వాడిపేరు పెడితే అచ్చు కాలేదని...!' రమ తడబడుతూ చెప్పింది.

'ఓహో!' ముక్తసరిగా అని వూరుకున్నాడు శ్రీధర్.

'మరి ఈ విషయం...!' రమ వాక్యం పూర్తి గాకుండానే 'సరే వెళ్ళిరా!' అంటూ లేచిపోయాడు శ్రీధర్. కాని ఈ అంగీకారం మనఃస్ఫూర్తిగా ఇవ్వలేదని రమ గ్రహించి చాలాసేపు అలాగే నిల్చుండిపోయింది. నాలుగు నిముషాలనంతరం వీధిలో నుంచి ఏవో కొత్త కంఠాలు వినిపించాయి. లెటర్ టేబిల్మీద పెట్టి గబగబా పైకి రాబోయేదల్లా గుమ్మంలోని శ్రీధర్ని చూసి ఆగిపోయింది రమ.

రమవైపు చూస్తూ 'నీకోసం ఎవరో వచ్చారు చూడు' అంటూ పేపర్ పుచ్చుకూర్చున్నాడు శ్రీధర్.

'ఎవరా' అని ఆతృతగా చూసిన రమ ప్రమాన్పడి నిల్చుండిపోయింది. ఎవరో నలుగురు మగవాళ్ళు నిల్చునివున్నారు. ఇందాక శ్రీధర్ చూసిన చూపులో వాడితనం ఎందుకు ప్రస్ఫుటమైయిందీ గ్రహించేసరికి తుఫాను తాకిడికి లతవలే ఆమె నిలువునా వణికిపోయింది. నిలబడటానికి శక్తిలేనట్లు తలుపుని గట్టిగా పట్టుకుంది రమ.

'ఎవరు కావాలి మీకు!' కంఠం వణకుతుండగా గట్టిగా ప్రశ్నించింది.

'రచయిత్రి రమాదేవి మీరేననుకుంటాను' ఒకతను ప్రశ్నించాడు.

వేణు కోరిక మనసులో ప్రతిధ్వనించగా 'అవును' అంది రమ నిర్జీవంగా.

'వెరీ గ్లాడ్! కథారచనలోనేకాక మీలో కూడ చక్కని సంస్కారం ఇమిడివుండటం మాబోటి సాహిత్యప్రియులకి, అభిమానులకి చాల అదృష్టం. మా క్లబ్ తరఫున మీకు సన్మానం చెయ్యాలనుకుంటున్నాము. తప్పక అంగీకరిస్తారనే ఆశతో ఉన్నాం.' ఇందాకతనే తిరిగి అన్నాడు.

'థాంక్స్! మీ అభిమానానికి చాల కృతజ్ఞురాలిని. కాని నాకివన్నీ ఇష్టంలేదు. సారీ! ఇలా అన్నందుకు క్షమించండి. దయచేసి ఇలాంటివి ఇకముందు తలపెట్టవద్దు' రమ గబగబా ఇంట్లోకి వచ్చేసింది. గదిలో శ్రీధర్ పేపర్ చదువుతున్నాడు. కాని అతని చెవులు తమ సంభాషణని వింటున్నాయని తెలియడానికి అట్టేసేపు పట్టలేదు రమకి. అతని సంకుచిత స్వభావము తన జీవితంమీద ఎలాంటి పరిణామం తీసుకొచ్చేది తలుచుకొంటే ఆమెకి తల తిరిగిపోతోంది. ప్రతిమలా సోఫామీద చెయ్యిపెట్టి బాధగా కళ్ళు మూసుకున్న రమని గుడినుంచి వచ్చిన అత్తగారి పిలుపుతో తేరుకుని—

'ఏం లేదత్తయ్యా!' అని శ్రీధర్



# ఒకపువ్వు రాలి ది

గదిలోకి వచ్చింది.

'ఊ! ఇప్పుడు జ్ఞాపక మొచ్చేనన్న మాట. నీ అభిమానులు వెళ్ళిపోయారను కుంటాను. సన్మానానికి అంగీకరించావా!' రమ ముఖంలోకి చూస్తూ ప్రశ్నించాడు శ్రీధర్. నిలువునా దహించేట్టున్న అతని చూపులని తట్టుకునే శక్తిలేక ముఖం దించుకుని 'లేదు. నాకిష్టంలేదని చెప్పి పంపించేసాను' నన్ను నమ్మలేరా? అనే భావం ప్రస్ఫుటమయ్యేట్టు అంది రమ.

'ఓహో ?' అన్నాడు ముక్తసరిగా శ్రీధర్.

'నేను విజయవాడ వెళ్ళను' ఎలాగో గొంతు పెగల్చుకు అంది రమ.

'ఏం!' పొడిగా ప్రశ్నించాడు శ్రీధర్.

'మీలొక్కరే ఎలా వుంటారు.'

'పర్వాలేదు. అమ్మ వుంది'

'ఆమె పెద్దవారు, చెయ్యలేరు'

'ఏమిటీ న్యూసెన్స్, నాలుగు రోజులకి నేనేమి కానులే!' విసురుగా లేచి వెళ్ళిపోయాడు శ్రీధర్.

'భగవాన్ ఏమిటి నా బ్రతుకిలా తయారయింది. ఆయన ఎందుకిలా మారిపోయారు. నా హృదయంమీద నమ్మకం ఎందుకు కలగడం లేదు, వలవలా హృదయ భారం తీరేట్టు ఏడ్చింది రమ.

మనసునిండా పేరుకు పోయిన అశాంతితో భారంగా పుట్టింటికి బయలుదేరింది రమ. వేణుని చూడగానే కళ తప్పిన ముఖం కొత్త కాంతిని పుంజుకుంది. అక్కడవున్న నాలుగురోజులు నిండుగా తిరిగింది. కాని శ్రీధర్ ప్రవర్తనగురించి పొరపాటునకూడ ఒకమాట దొర్లకుండా జాగ్రత్తపడింది. చెప్పితే వేణు బాధపడతాడు. కసికొద్దీ ఏదైనా చేస్తే అతని మనసు పూర్తిగా విరిగిపోతుందని భయపడి తిరిగి ప్రయాణమైయింది రమ. రైలు ఎక్కించి వెళ్ళేవరకూ చూస్తూ నిల్చున్నాడు వేణు

ఏడాది గిర్రున తిరిగిపోయింది. ప్రఖ్యాత రచయిత్రుల లిస్ట్లో చేరిపోయింది రమ. ఖ్యాతి పెరుగుతున్నకొద్దీ సన్మానాలు అందుకోక పోయినా ఇంటికివచ్చి అభినందించేవారు ఎక్కువైపోయారు. గాలిలో దీపమైయింది రమ జీవితం. తనప్రతి ఉనికిని అనుమానపు దృష్టితో శ్రీధర్ చూడటం సహించలేక పోయింది. దీనికి తోడు ఇంటికి పెద్దదిక్కు, తనని అన్ని విధాల తల్లిలా ఆదరించిన అత్తగారు కన్ను మూయడంతో ఒంటరితనం మరీ దుర్భర మనిపించింది రమకి. తనకి వచ్చిన ఉత్తరాలన్నింటిని అగ్నికి ఆహుతి చేసింది రమ. కాని...అందులో ప్రతిబింబించిన వేణు ముఖం చూడలేక పక్క మీదపడి వెక్కివెక్కి ఏడ్చింది రమ.

రోజులు దొర్లిపోతున్నకొద్దీ ఆమె ఆరోగ్యం దెబ్బతింది. జ్వరం వస్తున్నా లెక్కచెయ్యకుండా మానసికంగా కృంగిపోయింది. చివరికి ఆజ్వరమే టైఫాయిడ్కి దించింది. ఫలితంగా హాస్పటల్కి వెళ్ళ వలసి వచ్చింది. వేణు గాభరాగా పరిగెత్తి వచ్చాడు. నెలరోజులు తిరిగినా జ్వరం తిరుగుముఖం పట్టలేదు.

'అక్కా! ఏమిటిది నీకేమయింది' దిగులుగా ప్రశ్నించాడు వేణు, అటువైపు కూర్చుని సిగరెట్ కాలుస్తున్న శ్రీధర్ని చూస్తూ.

'ఏమి కాలేదు వేణూ! ఎందుకంత దిగులుపడతావు. వట్టినే వచ్చింది' తేలికగా అంది నీరసంగా రమ. 'కాదు ఏదో జరిగింది. బావా! మీరయినా చెప్పండి' శ్రీధర్వైపు చూస్తూ అన్నాడు వేణు.

'నాకు తెలీదు' శూన్యంలోకి చూస్తూ ముభావంగా అన్నాడు శ్రీధర్.

'వేణూ! ఏమిటి నీ పిచ్చి. ఆయనకేం తెలుసు' మందలింపుగా అంది రమ. 'అక్కా! నేనంత అర్థం చేసుకోలేని పసివాడిని కాదు. నీ ఆరోగ్యం ఇలా వుంటే బావ తన...' వేణు.

'వేణూ!' అన్న గర్జన విని ఆగిపోయాడు. 'నా వ్యక్తిగత విషయం నీకవసరం. ఆయన్ని అట్టే విసిగించకు...' గట్టిగా అంది రమ. 'అక్కా! విసిగించను వెళ్ళిపోతాను. నీ దాంపత్య జీవితం సుఖంగా సాగేట్టు చూసి మరీ వెళ్తాను' శ్రీధర్వైపు గుర్రుగా చూస్తూ వెళ్ళిపోయాడు వేణు. 'హు! నేనూ చూస్తాను. దీని అంతేమిటో. రమా! గుర్తుంచుకో, ఇదే మన ఆఖరి చూపు.' వడివడిగా సిగరెట్ విసరి వెళ్ళిపోయాడు శ్రీధర్.

'ఏమండీ' హృదయ విదారకంగా రోదిస్తూ బెడ్కి అత్తుకుపోయింది రమ.

* * *

బాలభానుడు తన వేడి కిరణాలతో శ్రీధర్ని తట్టిలేపాడు. ప్రక్కన ఫోను ఒక్కటే మ్రోగుతోంది. లేచి రిసీవర్ తీసి 'హలో!' అన్నాడు శ్రీధర్.

'బావా! నీలో మానవత్వం ఏ కొసనైనా వుంటే వెంటనే బయలుదేరి రా!' శ్రీధర్ కాళ్ళు అప్రయత్నంగా కారువైపు నడచాయి. నాలుగునిముషాలు గడిచాయి. శ్రీధర్ హాస్పటల్ స్పెషల్ రూములో అడుగుపెట్టిన మరుక్షణం శిలాప్రతిమే అయ్యాడు. స్లీపింగ్ పిల్స్ ప్రభావంతో సుదీర్ఘంగా నిద్రపోతోంది, ప్రఖ్యాత రచయిత్రి కాని తమాషా.



[illegible] కాలనీ [illegible] పీసు కార్యాలయంలో డ్రయివరుగా పని చేస్తున్న ముస్నంగి కృష్ణ అనే అతను ఎండ్రిన్ తాగి చని పోయాడట. పెట్రోలు దొంగిలించాడన్న నేరం మీద అతన్ని వుద్యోగం నుంచి తొలగిస్తే, రెక్కాడితేగాని, డొక్కాడని కుటుంబాన్ని, కుటుంబ భారాన్ని భరించలేక తన జీవితాన్ని అరకంగా అంతం చేసుకున్నాడట.

## రైలు పెట్టెలో పసిబిడ్డ శవం!

మద్రాసు సెంట్రల్ స్టేషనులో ఒక రైలు బండిని కడుగుతుండగా, మూడవతరగతి పెట్టెలో ఆరు మాసాల పసికందు శవం దొరికిందట. ఆ శవాన్ని చూసిన వ్యక్తి పోలీసులకు చెప్తే వారు ఎవరు ఎందుకు ఎప్పుడు ఎలా హత్య చేశారో పసిగుడ్డును— అసలిది హత్యేనా అన్న విషయాలు విచారించడానికి రంగంలో దిగారు.

## భర్తని పొడిచిన భార్య

కి. శి. రూజ్‌వెల్టు (యునైటెడ్ స్టేట్స్ ప్రెసిడెంట్) కుమారుడు మిస్టర్ జేమ్స్ రూజ్ వెల్టును అతని పరివారంలో ఒకరు వెనుకపాటుగా పొడిచారట. 61 సంవత్సరాల వయస్సున్న జేమ్స్ రూజ్‌వెల్టుని ఆసుపత్రిలో చేరుస్తే ఆయన కోలుకొంటున్నారట. తనని ఒక అజ్ఞాత స్త్రీ




పొరక మాటున పొడిచిందని పత్రికల్లో పడ్డ వార్తకి సమాధానంగా "ఆ అజ్ఞాత స్త్రీ నా భార్యే: షియీజ్ మై వైఫ్" అన్నారట. ఇది జెనీవాలో జరిగింది.




## కౌన్సిల్ సభలో ముష్టియుద్ధం

మద్రాసు కౌన్సిల్ సభలో "నగరంలోని నీటి సమస్య" అనే విషయం మీద చర్చ ప్రారంభించా రట. ద్రవిడ మున్నేట్రకజగ ప్రభుత్వం యీ విష యంలో చూపించాల్సినంత శ్రద్ధ చూపించటం లేదని, దీనికి వెంటనే కమిటీని వేయాలని ఓ కాంగ్రెసు సభ్యుడు అనేసరికి డి. యం. కె. మెంబరు సి. గణేశన్ అసలు కాంగ్రెసు ప్రభుత్వమే తన రోజుల్లో యీ నీటి సమస్యను పరిష్కరించలేదని, కృష్ణ, కావేరి నీటిని మద్రాసు తీసుకు రావడం చేయలేదని నిందించాడట. దాంతో వాగ్యుద్ధం బయలుదేరి అది ముష్టాముష్టిగా, తయారయిందట. గ్లాసులు ఒకరి మీద ఒకరు విసురుకున్నారట. పెక్కుమందికి గాయాలు తగిలాయట. ఈ సందర్భంలో ముగ్గురు కౌన్సిలరులు, మరో వ్యక్తి—వెరసి నలుగురు ఆసుపత్రిలో చేర్చబడ్డారట.

* * *

11 ఆదివారంనాడు నెల్లూరులో జరిగిన హనుమాన్ జయంతి సందర్భంగా జరిగిన వుత్సవాలలో పానకం, ప్రసాదం తిన్న(తాగిన) వాళ్ళల్లో ఆరుగురు చనిపోయారట. 30 మంది ప్రమాద పరిస్థితిలో ఆసుపత్రిలో చేర్చబడ్డారట. ఇందులో కొంతమంది పరిస్థితి ఇంకా తేల్చి చెప్పడం కష్టంగా వుందట.

## హాయిమైన యాత్రికుడు

పాట్నాకి 100 కిలోమీటర్ల దూరంలో వున్న రాజ్‌గిర్‌ను చూడవచ్చిన (విహారయాత్ర) జాన్ ఫ్రాంక్ అనే జపానీయుడు మటుమాయం, అయిపోయాడట. రాజ్‌గిర్ రామకృష్ణ మిషన్ ఆశ్రమం మేనేజరు "శాంతి స్తూపాన్ని చూడడానికి వెళ్ళిన ఫ్రాంక్ తిరిగి రాలేద"ని తెలియజేశారట.

* * *

ఓ వాగ్వాదంలో ఉద్రిక్తులయిన ఆర్. యస్. పి. కి చెందిన త్రిదిబ్‌కుమార్ చౌధురి, కాంగ్రెసుకు చెందిన యస్. పి. సి. నాయుడు యిద్దరూ లోక్‌సభలో తన్నుకోడానికి సిద్ధపడ్డారట. ఇద్దర్నీ ఆపు చేయడానికి విశ్వప్రయత్నం అయిందట.

* * *

జపాన్‌లో 1965లో జరిపిన సర్వేనిబట్టి ఆ దేశంలో 2,45,000 మంది గుడ్డి వారుంటారని తేలిందట. మైనిచీ షింబున్ అనే ఒక పత్రికా సంస్థ 'బ్రైలీ మైనిచి' అనే పత్రికను ప్రతి ఆదివారం ప్రచురిస్తోందట. ఇవి 10వేల కాపీలమ్ముడు పోతున్నాయట. ఈ ప్రతి కేవలం గుడ్డివారికేనట.

## టుప్రాలు

కోడిపిల్లలను తినేవారిలో చాలామంది తమ శక్తిని కోల్పోతారని, యీ మాంసంలో పెట్టుకు సంబంధించిన కొన్ని గ్రంథులను అణచివేసేశక్తి వుందనీ డాక్టర్ ఆలన్‌లాంగ్ అన్నారు— అమెరికాలో.




కుటుంబనియంత్రణ పథకంలో గర్భనిరోధక మాత్రలు వాడడంవల్ల కాన్సరు పొట్టలోగాని, స్తనములలోగాని, వచ్చే ప్రమాదం వుందని వాషింగ్టన్‌లో ఒక 'ఆ శాఖ' నిపుణుడు అన్నాడు.



ఆత్మీయులు లో నాగేశ్వరరావు వాణిశ్రీ

# సినిమా

వాహిని స్టూడియోకు వెళ్లాను అక్కడ అయిదవ ఫ్లోర్‌లో శ్రీ ఆనందమోహన్‌ను చూచాను ఆయన్ను చూడగానే మామంచి అక్కయ్య షూటింగు జరుగుతున్నట్టు తెలుసుకున్నాను సెట్లోకి వెళ్లాను

అది పబ్లిక్ పార్కు ఒక సిమెంటు బెంచీమీద తారలు శ్రీమతి కె ఆర్ విజయ శోభన్‌బాబు కూర్చుని మాట్లాడు కుంటున్నారు

శోభన్‌బాబు మీ నాన్న చెడ్డవాడు అందుకని నిన్ను నేను పెండ్లాడను అని చెప్పలేకపోయావా? (అని విజయతో అంటాడు

విజయ: మాంగల్యమే భార్య అవడానికి చిహ్నమయితే, నేను ఇప్పటిదాకా భార్యను కాను కానీ మనస్సాక్షి మన ప్రేమకు ఆధారమనుకుంటే, నేను యెప్పుడో మీ భార్యను అయ్యాను (అంటూ శోభన్ వాడిలో వాలిపోతుంది)

శోభన్: నీ ఆదర్శాన్ని అభినందిస్తున్నాను నీ అనురాగాన్ని అభిమానిస్తున్నాను

కట్'— ఓ కే అన్నారు దర్శకులు శ్రీ ఆదుర్తి నరసింహమూర్తి షాట్ బాగా వచ్చిందండీ అన్నారు ఛాయాగ్రాహకుడు శ్రీ కన్నప్పన్. ఈ పద్మశ్రీ వి. ఎం ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న 'మామంచి అక్కయ్య' చిత్రానికిగాను వాహినిలో చిత్రీకరించబడింది ఒక చక్కటి కుటుంబ గాథకు శ్రీ ఆదుర్తి నరసింహమూర్తి స్క్రీన్‌ప్లేను తయారుచేసి, ఈ చిత్రాన్ని డైరెక్టు చేస్తున్నారు ముఖ్య పాత్రలను శ్రీయుతులు నాగభూషణం, శోభన్ బాబు, కృష్ణ, పద్మనాభం, ప్రభాకర రెడ్డి, రాజబాబు, అల్లు రామలింగయ్య, బాలకృష్ణ, కె ఆర్ విజయ, రాజశ్రీ, హేమలత, పుష్పకుమారి, బేబి రాణి పోషిస్తున్నారు

* * *

వాహిని స్టూడియోనుండి ఎ వి ఎం కు బయల్దేరాను అక్కడ విచిత్ర కుటుంబం' షూటింగును చూచాను

శ్రీ నాగభూషణంకు శ్రీ ఎన్ టి రామారావుపై పగ, ద్వేషం ఆయనకు శ్రీ ప్రభాకరరెడ్డి అడుగులకు మడుగులొత్తే సేవకుడు నాగభూషణం ఏం చెయ్యమన్నా, చెయ్యడానికి వెనుకాడడు నాగభూషణం తమ్ముడు శోభన్ బాబు చిన్నప్పట్నుంచి శ్రీ రామారావు యింట్లోనే పెరిగారు ఆస్తి తన తమ్ముడికి దక్కకుండా వుండాలని నాగభూషణం ప్రభాకరరెడ్డిని తన కార్యాచరణకై వుపయోగించుకుంటాడు నాగభూషణంకు ఒక సెక్రటరీ వుంటారు

సెక్ర అదేసార్ నా సందేహం మీ తమ్ముడు శ్రీ రామారావుగారివే సైడు చేస్తారు వాళ్ళందరూ ఒకటై మీ మీద కొస్తే? (అని నాగభూషణంతో అంటాడు)

ప్రభాకరరెడ్డి అప్పుడు శవాలు రెండవుతాయి

సెక్ర: అంటే?

నవ్వుతూ నాగభూషణం ఒకటి నా తమ్ముడు రెండు (నాగభూషణం గారి ప్రక్కనే వున్న ఆయన సతీమణి శ్రీమతి పుష్పకుమారి ఆశ్చర్యంగా)

పుష్పకుమారి ఏమండీ?

నాగభూషణం ఏం? నువ్వు కూడా శవాల పార్టీలో చేరతావా? నోరు మూసుకుని తోవలికెళ్లు

'కట్' అన్నారు దర్శకులు శ్రీ కె.



రాజసింహ లో వాణిశ్రీ కాంతారావు






శ్రేష్ఠమైన రుచియు
మంచి సువాసనతో నిండిన
పానీయము
ధరయో అతి సరసము
లిప్టన్స్ హిమాలయన్
గోల్డెన్ డస్ట్ టీ.

ఎవరయినా కానీయండి, ఒక్కసారి త్రాగితే చాలు—మళ్లీ మళ్లీ అడుగుతారు నిస్సందేహంగా, మీకు మహదానంద కరమైన తృప్తినిచ్చే చిక్కని, కమ్మని పానీయం యిది. కప్పు తర్వాత మళ్లీ కప్పు. త్రాగటం సరికొత్త మధురానుభూతిని ప్రసాదిస్తుంది. పైగా, యిది ఎంతో లాభదాయకము.




లిప్టన్స్
అంటే మంచి టీ

LHGC

టిఎస్. ప్రకాశరావు. నాగభూషణం వేసిన ప్లాను పారిందా? శ్రీ రామారావు శోభన్ బాబులను, ప్రభాకరరెడ్డి తన శక్తికి ఎర చేసారా? అసలు నాగభూషణం చేజిక్కించుకున్నారా? అనేది ప్రశ్నలకు మే 28 న విడుదల కానున్న శ్రీ రాజ్ ఆర్ట్ పిక్చర్స్ 'విచిత్రకుటుంబం' సమాధానమిస్తుంది. శ్రీ సుంకువల్లి నిర్మిస్తున్న ఈ విచిత్రమైన సాంఘిక చిత్రానికి శ్రీ భమిడిపాటి సంభాషణలను, శ్రీ టి. వి. రాజా సంగీతాన్ని, శ్రీ సంపత్ ఛాయాగ్రహణాన్ని నిర్వహించారు. కృష్ణ, విజయనిర్మల ప్రేమికులుగా నటించే యీ చిత్రంలో శ్రీమతి సావిత్రి ఒక కొత్తతరహా పాత్రను ప్రతిభావంతంగా నిర్వహించారు. ఈ చిత్రం విజయా పిక్చర్స్‌ద్వారా విడుదలౌతుంది.

* * *

నా రెండవరోజు పయనాన్ని సినిమా కంపెనీలకు సరిపెట్టాను. నేను సేకరించిన వార్తలను మీకు అందజేస్తున్నాము.

'భార్య,' 'కలసిన మనసులు' చిత్రాలను నిర్మించిన శ్రీ ఎం. ఎస్. రెడ్డి తన

# సినిమా

ఆఫీసును హబిబుల్లా రోడ్డులోగల ఒక పెద్ద భవంతికి మార్చారని తెలిసింది. ఆయన్ను కలిసి 'రెడ్డిగారూ, మీ 'కలసిన మనసులు' విడుదలై ఏడు మాసాలయింది గదా? ఇప్పట్లో ఏం ప్లాను చెయ్యడం లేదా?' అని ప్రశ్నించాను. 'శ్రీ కృష్ణ విజయం అనేది పౌరాణికాన్ని నిర్మించ దలచి స్క్రిప్టు తయారుచేసిపెట్టాను. పద్యాలుకూడా నేనే వ్రాశాను. కొన్ని వినండి అని ఆయన రచించిన పద్యాలను వినిపించారు. నేను విన్న పద్యాలన్నీ చాలా బాగున్నాయి. 'మరి అంతా సిద్ధం చేసుకుని కూడా యింకా షూటింగు ప్రారంభించ లేదేమండీ?' అని అడిగాను. ఇది రసవత్తరంగా వచ్చింది. ఎంతో శ్రమించి రచన చేసాను. శ్రీ పింగళి నాతోపాటు షుమారు 200 రోజులు కూర్చుని, చక్కటి సంభాషణలను సమకూర్చిపెట్టారు. పాత్రలకు తగిన నటీనటులను పెడితేనే యీ రసమయ



'మా మంచి అక్కయ్య'లో కె. ఆర్. విజయ.

## మీకు తెలుసా?

హిందీ నటుడు శ్రీ దేవానంద్ గత పదిహేను నెలలుగా ఒక చిత్రాన్ని నిర్మిస్తున్నారు. ఆ కథలోవుండే వన్ని వేశాలను యేయే ప్రదేశాలలో చిత్రీకరించబడితే బాగుంటుందో ఆయా ప్రదేశాలకు వెళ్ళి చిత్రీకరించడం వల్లనే యింత ఆలస్యం జరుగుతూందట.

ప్రముఖ తారలు కొందరు తమ పేర్లపై టెలిఫోను నెంబర్లను వుంచుకోవడం లేదు. తమ అభిమాన ప్రేక్షకులు తరుచు ఫోను చేస్తారనే భయమే దీనికి కారణమట.

ప్రముఖనటి శ్రీమతి పద్మిని మలేషియాకు పోవడం జరిగితే, ఇప్పోఅనే వూరికి తప్పక వెళ్ళడం ఆచారమట

అపరాధ పరిశోధక చిత్రాలనే నిర్మించే మిస్టర్ ఆల్ఫ్రెడ్ హిచ్‌కాక్‌కు యిప్పుడు 68 సంవత్సరాలట. అయినా, యింకా వుత్సాహంగానే అలాంటి చిత్రాలను తయారుచేసి టెలివిషన్‌కు అమ్ముతున్నారట

సృష్టికి విందుదనం వస్తుంది. అందుకే యీ ఆలస్యం' అన్నారు. 'ఎవరెవర్నితీసుకోవా లనుకుంటున్నారు?' అడిగాను. 'శ్రీకృష్ణుడి పాత్రకు అన్నివిధాల సరితూగ గల నటుడు శ్రీ రామారావేనని నా అభిప్రాయం. ఆయన యెప్పుడు కనికరించి కాల్‌షీట్లు యిస్తారో అప్పుడే ప్రారంభిస్తాను. ఆయన అంటే నాకెంతో గౌరవం. ఆయన్ను శ్రీకృష్ణుడిగా నటింపచేయాలనే పట్టుదలే నన్ను యింత ఆలస్యం చేయిస్తుంది. అలాగే [illegible] పాత్రకు శ్రీ రంగారావుగార్ని నాయిక వేషానికి కుమారి జయలలితను అడిగి, వారిని ఒప్పించాలని అనుకుంటున్నాను. కాబట్టి నిర్మాణం కాస్త టైం తీసుకోవచ్చు' అని పూర్తిచేసారు.

* * *

హబిబుల్లా రోడ్డునుండి బోగ్‌రోడ్డుకు వచ్చాను; బోగ్‌రోడ్డులోగల దిగ్విజయా పిక్చర్స్ ఆఫీసుకు వెళ్ళాను. ఆఫీసు రూములో వున్న నిర్మాతలు శ్రీయుతులు



'ఆదర్శకుటుంబం'లో జయలలిత, నాగేశ్వరరావు



పూర్ణా ఆర్టుపిక్చర్స్ 'మాతృదేవత' యూనిట్.



'తదలదు—వద్దలదు'లో రామకృష్ణ, జయలలిత

## సినిమా

జయశేఖర్, రత్నంగార్లను కలిసి వాళ్ల 'ప్రేమకానుక' చిత్రాన్ని గురించి ప్రశ్నించాను. వారు నాకు చెప్పిన సమాచారాన్ని మీ ముందుచుతున్నాను.

'మా చిత్రంయొక్క షూటింగు ముప్పాతిక పైభాగం పూర్తయింది. రెండు పాటలచిత్రీకరణ అవుట్‌డోర్‌లో చెయ్యాల్సి వుంది. అది మినహా ఒక్కే ఒక సెట్టు పని మిగిలివుంది. జూన్ మొదటివారంలో పూర్తిచెయ్యా లనుకుంటున్నాము. మాకు చిత్రనిర్మాణంలో తోడ్పడుతున్న సంగీత దర్శకులు శ్రీ తాతినేని చలపతిరావుకి మా ధన్యవాదాలు చెప్పడం మా ధర్మం' అని నిర్మాతలిద్దరూ ఏక కంఠంతో వెల్లడించారు.

* * *

వాహినికి వెళ్లిన నాకు శ్రీ విశాలాచార్య కుమారుడు శ్రీ బి. వి. శ్రీనివాస్ కనుపించారు. వాళ్ల షూటింగు వుందని తెలిసింది. రెండవ ఫ్లోర్‌లోకి అడుగుపెట్టాను. శ్రీ రామారావు కుమారి రాజశ్రీని తన బాహుబంధాల్లో యిరికించుకుని కమ్మటి పాటను ఆలాపించారు. రాజశ్రీమాత్రం తీసిపోయిందేమిటి? ఆమె కూడా శ్రీ రామారావును తన ప్రణయకలాపంతో ప్రోత్సాహపరుస్తూ పాడసాగింది.

ఎన్. టి. ఆర్. రవ్వల రాజకుమారీ
నా నవజీవన నాట్యమయూరీ
అందెలు పలుకగ రావే
మకరందము చిలుకగ రావే,

రాజశ్రీ : ఈ వేళలో
ఏమున్నదో
పలికెను లోన
కళ్యాణవీణ—

ఈ పాటను శ్రీ నారాయణరెడ్డి వ్రాశారు. శ్రీ విజయాకృష్ణమూర్తి సంగీత దర్శకత్వంలో శ్రీమతి సుశీల, శ్రీ ఘంటసాల పాడారు. హుషారయిన యీ సన్నివేశాన్ని యువదర్శకుడు శ్రీ బి. వి. శ్రీనివాస్ రసవత్తరంగా చిత్రీకరించారు. శ్రీ ఎన్. టి. రామారావు, కుమారి రాజశ్రీ ఎప్పుడు, ఎక్కడ, ఎలా ప్రేమికులయ్యారు అన్నదానికి సమాధానం విరల్ కంబైన్స్ నిర్మిస్తున్న జానపద చిత్రం.

* * *

'అగ్గిబరాటా', 'పిడుగురాముడు' చిత్రాల అనంతరం శ్రీ రామారావుతో కుమారి రాజశ్రీ జంటగా నటించడం ఈ చిత్రంలోనే; రాజశ్రీ క్రితంకన్నా ఇప్పుడు మరింత గ్లామరస్‌గా కనిపిస్తూంది; నిజాన్ని మనస్సులో దాచుకోలేక 'మీరు చాలా అందంగా కనిపిస్తున్నారండీ. కానీ ఇంకాస్త లావుగా వుంటే బాగుంటుంది' అని చెప్పేసాను...నే నిచ్చిన సలహాతో శ్రీ విఠలాచార్యకూడ ఏకీభవించారు. ఆమె కూడా నవ్వుతూ 'అలాగే నండీ' అని సమాధాన మిచ్చింది.

* * *

రెండవ ఫ్లోర్‌నుండి ఆరవ ఫ్లోర్‌లోకి దారి తీసాము. అది ఒక పూరిగుడిసె; శ్రీ నాగేశ్వరరావు, శ్రీమతి కె. ఆర్. విజయ ప్రక్కప్రక్కన కూర్చుని వున్నారే గాని శ్రీ అక్కినేని బాధపడుతున్నట్లు కనిపించింది. ఆయన్ను కె. ఆర్. విజయ ఓదార్చడానికి ప్రయత్నిస్తూంది. చిలకా గోరింకల్లావున్న నాగేశ్వరరావు, విజయలను అలాగే చాలాసేపు చూస్తుండిపోయాను. వాళ్ళిద్దరి మధ్య జరిగిన సంభాషణను మీకు తెలియచేస్తాను.

నాగేశ్వరరావు: నీపై చేయి చేసుకుంటాడా. అయన్ను అక్కడ్నే...(పళ్ళు కొరుకుతారు.)

విజయ: హూఁ. బాధపడకు!

నాగేశ్వరరావు: అయన్ను దేవుడిలాగా చూసుకుంటున్నాగా.

విజయ: హూఁ. ఒకసారి నిన్ను నేను ఎదిరించి మాటాడేనని నన్ను నువ్వు కొట్టలేదా?

నాగేశ్వరరావు: ఏంచేం. నువ్వునేది. అది యిది ఒకటవుతుందటే,

విజయ: ఈ తాళిబొట్టును చూడు మావా. ఇది నామెడలో నీవు కట్టడానికి ఆయనే కారకుడని మరచిపోయావా.

అని విజయ అనేసరికి శ్రీ నాగేశ్వరరావు నిట్టూర్పు విడిచారు. 'కట్' అన్నారు దర్శకులు శ్రీ జి. వి. ఆర్. శేషగిరిరావు. ఈ సన్నివేశాన్ని సురేష్‌మూవీస్ నిర్మించే చిత్రంలో మీరు చూస్తారు. శ్రీ అక్కినేని ద్విపాత్రాభినయం చేస్తున్న ఈ సాంఘిక చిత్రానికి శ్రీ తురయార్‌మూర్తి కథను, శ్రీ భమిడిపాటి సంభాషణలను సమ







'విచిత్ర కుటుంబం' లో సావిత్రి, విజయనిర్మల.



అజంతా మూవీస్ ప్రొడక్షన్ నెం. 1 లో లక్ష్మి, శ్యామల, రాంబాబు



## సినిమా

కూర్చారు. శ్రీ విశ్వనాథన్ సంగీతాన్ని; శ్రీ రాజేంద్రకుమార్ కళను, శ్రీ భాస్కరరావు కెమరాను, శ్రీ సత్యం స్టిల్సును నిర్వహిస్తున్న యీ చిత్రాన్ని శ్రీ డి. రామానాయుడు నిర్మిస్తున్నారు. నవయుగా ఫిలింస్ విడుదల చెయ్యనున్న యీ చిత్రంలోని ముఖ్య పాత్రలను నాగేశ్వరరావు, జగ్గయ్య, సత్యనారాయణ, మిక్కిలినేని, రాజబాబు, కె. ఆర్. విజయ, భారతి పోషిస్తున్నారు.

* * *

సురేష్ పిక్చర్స్ షూటింగునుండి వీనస్ స్టుడియోకి దారి తీసాము. వీనస్ రెండవ ఫ్లోర్‌లో షూటింగు జరుగుతున్నట్లు తెలిసి సెట్లోకి వెళ్ళాము నవనాగరికపు దుస్తులను ధరించి కుమారి గీతాంజలి నిలబడి వుంది. గోధుమరంగు పట్టు చీరెను ధరించి, పతివ్రతా శిరోమణిలాగా కుమారి చంద్రకళ ఆమెకు యెదురుగా నిలబడి, మెడలోని మంగళసూత్రాన్ని చూపిస్తూ యేదో చెప్తూవుంటే. చంద్రకళపై జాలివేసింది. ఆమె కన్నీరు కార్చ డానికి కారణమేమిటో తెలుసుకుందామని కొన్త దగ్గరగా వెళ్ళి నిల్చున్నాము.

చంద్రకళ : (మంగళ సూత్రాన్ని చూపిస్తూ) దీంతో నన్ను పవిత్రురాలిని చేసారు అక్కా! నేను మీ యింట్లో చోటు యివ్వమని అడిగేందుకు రాలేదు. మీ మనస్సులో సాటి ఆడదాన్నిగా చేర్చుకుంటే చాలు నే నేమయినా కావచ్చు; కాని పతితను మాత్రం కానక్కా. పతితను కాను (అని చంద్రకళ తన పవిత్రతను వెల్లడిస్తుంటే, గీతాంజలి మౌనంగా వుండడం ఆశ్చర్యాన్ని కల్గించింది.)

ఈ సంఘటన నిజంగా జరిగిందను కునేరు సుమా. ఈ దృశ్యం ఎస్. వి. ఎస్. పిక్చర్స్ నిర్మిస్తున్న సాంఘిక చిత్రంలో మీకు కనిపిస్తుంది; చంద్రకళ ఎవరు? గీతాంజలి కేమౌతుంది? చంద్రకళకు మాంగల్యధారణ చేసినవారెవరు? అనేడి ప్రశ్నలకు దర్శకులు శ్రీ కె. విశ్వనాథ అతి త్వరలో మీకు సమాధానమిస్తారు శ్రీ జగన్నాథరావు నిర్మిస్తున్న ఈ చిత్రానికి శ్రీ పద్మ

# ఆటలందు అభిరుచి

బాలబాలికలకి యౌవనారంభం నుంచే ఆటలందు ఆసక్తి కలిగించాలన్నది క్రీడా రంగం గురించి ఎవరు చర్చించినా మనకి సాధారణంగా వినిపిస్తుంది. నిజానికి యింకా చిన్నవయసు నించే ఆటలలో పిల్లలకి అభిరుచిని పెంపొందించడం ఎంతైనా అవసరం

సాధారణంగా తల్లిదండ్రులు తమ పిల్లల్ని స్కూల్‌లో చదివేప్పుడు వారు ఆటలని గురించి మాట్లాడటానికి యిష్టపడరు. ఆటలలో శిక్షణ తమ పిల్లలకి ఉండాలన్న ఉద్దేశ్యం వారు స్కూల్‌ని విడిచిపెట్టి పోతారనగా కలుగుతుంది

సాయంత్రం వేళల్లో పిల్లలు తప్పనిసరిగా ఆటలు ఆడాలనుకోడం చాలామంది తల్లిదండ్రులలో, పిల్లలలో అరుదుగా కనిపిస్తుంది ప్రస్తుతం స్కూల్‌లో ఆటలకి ఎన్నో సదుపాయాలు కలిగిస్తున్నా మనలో యింకా యిలాంటి అలవాటే ఉంది మద్రాసు వై. ఎం. సి. ఏ కాలేజి ఆఫ్ ఫిజికల్ ఎడ్యుకేషన్ ప్రిన్సిపాల్ డాక్టర్ జె పి థామస్ ఆటలందు పిల్లలకి ఆసక్తి కలిగించడానికి కొన్ని పథకాలని రూపొందించారు శ్రీ థామస్ ఏ ఆటని తీసుకున్నా అందులో ఆటగాళ్ళని శారీరకంగా తగినట్లు తయారు చేస్తారు. ఇటీవల ఈ విలేఖరి ఆయనతో మాట్లాడటం జరిగింది టెన్నిస్ ఆటగాళ్ళ శ్రమని తట్టుకునేందుకు వారిని ఎలా తయారు చేయాలో ఆయన వివరించారు ఆయన చెప్పిన అంశాలు ఎంతో మెచ్చుకోదగినవిగా ఉన్నాయి

శరీర దారుఢ్య లోపం వల్ల ఎంతో నేర్పు కల ఆటగాళ్ళు కూడా తీవ్రమైన పోటీలలో నిలబడలేక పోయిన సందర్భాలు ఎన్నో ఉన్నాయి వాటిని నివారించడానికి శ్రీ థామస్ సూచనలు ఎంతో ఉపకరిస్తాయి అయితే ఆ రకమైన వ్యాయామాన్ని చిన్నవయసులో ఉన్నవారే చేయడానికి అవకాశం ఉంటుంది.

ఆటల స్థాయిని పెంపొందించడానికి శ్రీ థామస్ ఒక ప్రణాళికని తయారు చేశారు. అందులోని అంశాలని ఆయన యిటీవల జరిగిన ఒక పత్రికా గోష్ఠిలో వివరించారు వాటిని ఈ శీర్షికలో ఈ వారం, పై వారం వివరంగా చర్చిస్తాను

స్కూళ్ళలో కనీసం వారానికి రెండు పీరియడ్‌లు అయినా ఆటలకి కేటాయించాలన్నది మొదటి అంశం. స్కూల్ వేళ అయిన తర్వాత వారానికి మూడు పీరియడ్‌లు ఆటలలో పాల్గొనడానికి ఉత్సాహం చూపించడం. ఇది చాలా ఉపయోగకరమైనది ఇప్పటి పిల్లలు తమ కాలాన్ని ఆటలకి వినియోగించరు కదా అన్న అనుమానం రావచ్చు చాలామందికి. తప్పనిసరిగా హాజరు కావాలన్న నియమాన్ని పెట్టి హాజరు తీసుకోడమే దీనికి సరైన మార్గం ఆవిధంగా భావిపౌరులకి ఆటలలో అభిరుచిని కలిగించి వారిని ఆరోగ్యవంతులుగా తయారు చేయవచ్చు ఆటలలో అభివృద్ధి సాధించిన వారి భవిష్యత్తు ఎంతో బాగుంటుందని వేరే చెప్పక్కర్లేదు

—కె. ఎస్. నరసింహన్




అటీ-ఇటీ...

## మద్రాసులో

### 'చల్లని చూపులు' నాటకం

శ్రీ సుకృతలక్ష్మీవిలాససభ వారు తమ సంస్థ 69 వ వార్షికోత్సవ సందర్భంగా ఇటీవల స్థానిక 'అన్నామలై మన్‌రమ్'లో "చల్లని చూపులు" సాంఘిక నాటకాన్ని ప్రదర్శించారు.

ఈ నాటకంలో శ్రీయుతులు కె శేషయ్య, బి వి పార్థసారథి, టి గోవిందరాజులు, పి శేషయ్య, ఎస్ ఎం. చంద్రశేఖర్, రమణమూర్తి, శ్రీనివాసులు, తిరువరంగం, శ్రీమతి సుమతి, కుమారి విజయరాధిక నటించారు నటీనటులంతా తమతమపాత్రల పరిధుల మేరకి నటించి శ్రీ రాజాశివానంద రాసిన ఈ నాటకాన్ని రక్తి కట్టించారు. దర్శకత్వాన్ని శ్రీ పి మోహనరంగనాయుడు, సంగీతాన్ని శ్రీ పీటర్ నిర్వహించారు వీరు యింకా కృషిచేసి మద్రాసులోని తెలుగు ప్రేక్షకులకు మంచి నాటకాలని అందిస్తారని ఆశించవచ్చు (ఒ వి)

*　*　*

శ్రీవజ్ఝల కాళిదాసు ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమి కౌన్సిలు సభ్యులుగా నియుక్తులైన సందర్భమును పురస్కరించుకొని ఇటీవల జమ్‌షెడ్‌పూర్ ఆంధ్ర నాటక సాహిత్య సంఘంవారు అభినందన సభ నేర్పాటు చేశారు (ఒ. వి.)

*　*　*

ప్రముఖ పారిశ్రామికవేత్త తణుకు జయలక్ష్మి ఫర్టిలైజర్స్ అధినేత శ్రీ యలమర్తి నారాయణరావు చౌదరి ప్రపంచయాత్ర చేయనున్న సందర్భంలో వారి గౌరవార్థం స్థానికులు వారికి అభినందన, సన్మాన సభ ఏర్పాటు చేశారు (ఒ. వి)

*　*　*

ఇటీవల తెలుగుసాహితి అధ్వర్యాన ఢిల్లీలో శ్రీ కొడవటిగంటి కుటుంబరావు గారికి ఘనసన్మానం జరిగింది ఆచార్య గంటి జోగి సోమయాజిగారు అధ్యక్షత వహించారు. (ఒ. వి.)

*　*　*

తిరుచిరాపల్లి ఆంధ్ర విజ్ఞానసమితి ఉగాది ఉత్సవాలని వైభవంగా జరుపుకున్నది ప్రధాన అతిథిగా శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి విచ్చేశారు స్థానిక బి హెచ్ ఇ జనరల్ మానేజర్ శ్రీ వి కృష్ణమూర్తి అధ్యక్షత వహించారు. (ఒ. వి)

*　*　*

హుబ్లీలోని ఆంధ్రకళామండలి సౌమ్య ఉగాదిని వైభవంగా జరుపుకున్నది సభకు శ్రీ బి ఏ షెనాయ్ అధ్యక్షత వహించారు లలితసంగీత పోటీలలో విజేతలకు బహుమతులను సభాధ్యక్షులు పంచిపెట్టారు. (ఒ. వి.)

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

# జి-11 గల సింథాల్
# యిప్పుడు
# ఎక్కువ సువాసన
# సమృద్ధియైన నురుగును యిస్తుంది




## మీకు లాభసాటిగా ఉండేలా
## రెండు సైజులలో లభిస్తోంది

ఈ క్రొత్త, మధ్య రకపు సింథాల్
మీరు కొనగలిగే ధరలో లభిస్తోంది.
ఈ సబ్బులో ఒక ధర తప్ప
తక్కినవన్నీ ఎక్కువే.
ఎక్కువ సువాసన—ఆహ్లాద
కరముగా చాల సేపు నిలిచి ఉంటుంది.
ఎక్కువ నురుగు—మృదువుగా,
సమృద్ధిగా ఉంటుంది.
ఒక్క సింథాల్ లోనే గల,
సాటిలేని జి-11 మిమ్మల్ని
రోజంతా హాయిగా ఉంచుతుంది.



**CINTHOL**

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA



# ఆంధ్రసచిత్రవారపత్రిక

జూన్ 1969

| ఆది | సోమ | మం | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 |
| 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 |
| 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 |
| 29 | 30 | 31 | | | | |